

కె.విజయకుమార్ సమర్పించు
శ్రీ విజయలక్ష్మీ పిక్చర్స్ వారి

# సరస్వతీ శపథం

(ఈస్ట్‌మన్ కలర్)

దర్శకత్వం: ఏ.పి.నాగరాజన్ .... సంగీతం: కె.వి.మహాదేవన్

ఆంధ్ర: మహాలక్ష్మి
నైజాం: జగత్
సీడెడ్: శ్రీశైల్

VANIE PUBLICITIES

# ఉత్తరాలు

### కథలు

19—5—67 వ తేది 'ఆంధ్రపత్రిక' చాలా బాగుంది 'నీడలేని పందిరి', 'నిప్పు', కథలు చక్కగా వున్నాయి. 'నిప్పు' కథ చదివింతర్వాత నా మనసు అదోవిధమైన బాధకు గురియై కొంతసేపు పరిసరాలను మర్చిపోయాను. రచయిత పాండురంగారావు గారికి నా అభినందనలు. 'నీడలేని పందిరి' వాస్తవంగా జరిగిందా అన్నట్లుగా వ్రాసారు రచయిత శ్రీ కరుణాకర్‌గారు. నిజమే మరి ప్రస్తుత విద్యావిధానమే అట్లా జరుగుతోంది. విద్యార్థులలో యిటువంటి ఆలోచనలు కలగడం సమాజానికి పెద్ద దెబ్బ. ఉపాధ్యాయులు తీర్చి దిద్దాలి మరి విద్యార్థులను. అపుడే దేశం పురోగతివైపు దారి తీస్తుంది. శ్రీ కరుణాకర్‌గారికి అభినందనలు.

టి. రవీంద్రరావు (విశాఖపట్టణం)

*　　　*　　　*

"అనూ" కథ నన్ను చాలా ఆకర్షించింది. కథ చివరలో, చదువరుల నందరినీ బాధిస్తుంది. 'అనూరాధ' పాత్ర ప్రశంసనీయమైనది.

కోడూరు రామమూర్తి (బెంగుళూరు)

*　　　*　　　*

"అనూ" కథ చాలా బాగున్నది, అనూరాధ లాంటివారు మానవత్వంలోని ఒక్కొక్క అపూర్వ సుగుణానికి అద్వితీయమైన విశిష్టతకు ప్రతీకలు. నర్సుగా అనూ రాధ పాత్ర కొనియాడ దగినది, నిస్వార్థపరులై, సర్వస్వాన్ని త్యాగం చేసి, నావారు, నీవారు అన్న భేదంలేక తోటి మానవుల సేవకై తమ జీవితాలనే కైంకర్యం చేసుకొని, దేవుడు పంపిన "ప్రేమ దూతలు" అని పిలువబడే నర్సు జీవితాలకు సమాజంలో ఒక ఉన్నత విలువ తెచ్చింది అనూరాధ.

వివాహమనగా భగవంతుడు ఏర్పరచిన పవిత్ర బంధమని, ప్రేమానురాగాల సంబంధమని ఈ వివాహ బంధాన్ని త్రెంపివేయు గల శక్తి ఎవ్వరికీ వుండదన్న సత్యాన్ని రచయిత అనూరాధపాత్ర ద్వారా నిరూపించారు.

టి. కె. ప్రభాకర్. (సిర్‌పూర్—కాగజ్‌నగర్)

### సీరియల్

అసలు విద్యార్థులలో క్రమ శిక్షణ తగ్గిపోవటానికి నాంది ఏమిటో 'తేజోవతి' గారు 'పూర్వాసంధ్యా ప్రవర్తతే.........' సీరియల్‌లో చాలా చక్కగా వ్రాశారు.

చాలామంది విద్యార్థులు ఉపాధ్యాయుల వద్ద నుంచి సరియైన శిక్షణ పొందలేక పోవటానికి కారణం కొందరు ఉపాధ్యాయులు నిష్పక్షపాతంగా ఉండలేక పోవటమే. అంటే మంచి విద్యార్థులంటే ఎక్కువ ప్రేమ, వారు తప్పక అభివృద్ధిలోకి రావాలని వాళ్ళకోసం ప్రత్యేకంగా శిక్షణ ఇవ్వటం చెడువిద్యార్థులు అంటే వాళ్ళ సంగతే ఆలోచించక పోవటం. అందువలన అందరి విద్యార్థులకు సరియైన (సమపాళంగా) న్యాయం చేకూర్చలేక పోతున్నారు ఇప్పటి 90 శాతము ఉపాధ్యాయులు.

విద్యార్థులలో క్రమశిక్షణ తక్కువవటానికి ఇదొక కారణం అంటే పెద్దలైన అనేక ఉపాధ్యాయులకు కోపం వస్తుందేమో కాని ఇది మాత్రం నిజం. ఇలా వ్రాయుటంలో ఏమైనా తప్పుగా తోస్తే (కొందరి ఉపాధ్యాయులకు) క్షమించ గోరుతూ.....'.......

యమ్. వి. అప్పారావు (హింజిలికట్)

### న్యూఢిల్లీ లేఖ

26—5—67 వారపత్రికలో 'న్యూఢిల్లీ లేఖ'లో శ్రీ కృష్ణగారు రాష్ట్రపతి ఎన్నిక విషయం ఎంతో దివ్యంగా వ్రాశారు. జనుల హృదయం చక్కగా గ్రహించి వ్రాశారు. ఇక వేరే ఎవరు

# ఎన్నో రకాలు ఎన్నుకోవడానికి

రేడియోలు మరియు ట్రాన్సిస్టర్లు
రు. 125 లు మొదలుకొని వున్నాయి.





మోడెల్ టిఐ 0816



మోడెల్ టిఐ 0581



మోడెల్ టిఐ 0579



మోడెల్ టిఐ 0509



మోడెల్ టిఎ/టియు 0777



మోడెల్ టిఎ 0926



మోడెల్ టిఎ/టియు 0202



మోడెల్ టిఎ/టియు 0776



మోడెల్ టిఎ/టియు 0824



మోడెల్ టిఎ 0366

వాటిని మీ స్నేహితుడైన మర్ఫీ డీలరు వద్ద యీరోజే చూడండి.

**murphy** మర్ఫీ మీ గృహానికి ఆనందాన్నిస్తుంది!

*Murphy sets the standard*

NAS 6142d

వ్యాఖ్య చేయు అవసరము లేకుండా వెస్త నత్యమునా వ్రాసినందుకు వారికివి, ప్రచురించిన మీకును నా కృతజ్ఞతాపూర్వకవందనములు.

వేరాల నందకిశోరు, త్రివిక్రమ (గుంటూరు.)

## ఉత్తరాలు

ఆంధ్రపత్రిక కొనిన వెంటనే నేను మొదట 'మ్యాధర్లీ శేఖ' చదువుట అలవాటు కలిగినది.

శ్రీకృష్ణగారు వాస్తవాన్ని కప్పిపుచ్చక నిజాన్ని విశదంగానే తెల్పడం ఎంతో మెచ్చుకోదగిన విషయము.

ఎస్. నరసింహారావు (తిరుమల)

# పైవారమే ప్రారంభం!

# ప్రశ్నావళి

## కొత్తశీర్షిక!

### చదువరుల ప్రశ్నలకి
### ఒక సుప్రసిద్ధ రచయిత్రి
### సమాధానాలు!

### మెదడుకి మేత

19—5—67 వ తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'మెదడుకిమేత' శీర్షిక క్రింద 'చదువుకున్న తప్పులు' అనే సమస్యకు జవాబు తప్పుగా అచ్చు అయింది. వరుసక్రమం ఈ క్రిందివిధంగా ఉండాలి:

| | |
|---|---|
| 1. 2 నుంచి 1 | 6. 4 నుంచి 7 |
| 2. 5 నుంచి 2 | 7. 1 నుంచి 4 |
| 3. 3 నుంచి 5 | 8. 3 నుంచి 1 |
| 4. 6 నుంచి 3 | 9. 6 నుంచి 3 |
| 5. 7 నుంచి 6 | 10. 7 నుంచి 6 |

పాఠకులు దీనిని గమనించవలసిందిగా కోరుతున్నాను.

మహీధర నళినీమోహన్.

### వ్యాసాలు

అతి ఉత్సాహజనకంగా పత్రిక కోసరం ఎదురు చూచి చేతికందగానే యువ్విళ్లూరుతూ వీక్షించేది జమునా రమణారావు 'నా విదేశయాత్ర' యీ వారముతోనే ముగించడము నన్ను చాలా నిరుత్సాహపరచినది.

కే. యమ్. క్రమూ ఆస్మానీ బేగం (మదరాసు.)









# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 9—6—'67
ప్లవంగనామ సం॥ జ్యేష్ఠమాసం శుద్ధ పాడ్యమి

సంపుటము : 59 సంచిక : 39

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'పంచకళ్యాణి'
రచన. శ్రీ కె. శేషగిరిరావు

కథలు :



సీరియల్ నవలలు:



శీర్షికలు, వ్యాసాలు, సినిమా.





# అభినవ భిక్షువులు



మెర్విన్ ద సిల్వా

"మీకు మీరే దీపాలు కావాలి." అన్నాడు బుద్ధుడయిన తర్వాత గౌతముడు తన అనుచరులతో. ప్రతి ఒకరికి ఒక భిక్ష పాత్ర, కాషాయం వస్త్రం ఇచ్చాడు. ఇవి రెండూ వారి సన్యాసానికి చిహ్నాలు.

నేడు ఒక కొత్తరకం భిక్షువు అవతరించాడు. అతను కాషాయ వస్త్రాలూ ధరించడు, సన్యాసిగానూ బతకడు. కాని, 'ధర్మం చెయ్యటం' అవసరమని ఉపదేశిస్తూ ప్రపంచమంతటా తిరుగుతాడు. భిక్షపాత్ర అతని చిహ్నాలలో ఒకటి,

ఈ అభినవ భిక్షువు మంచి సూట్లు వేస్తాడు, ఖరీదయిన సూటుకేసు నిండా ఏవేవో కాగితాలు నింపి విమానాలలో అమెరికా, రోమ్, లండన్, పారిస్, మాస్కోల మధ్య తిరుగుతూ ఉంటాడు. బాంగ్‌కాక్, టోక్యోలలోని 'సహాయం క్లబ్బు' సంగతి సరేసరి.

స్వదేశంలో అతనికి మంచి పేరు. తరచు అతని బొమ్మ పేపర్లో పడుతూ ఉంటుంది. పడినప్పుడెల్లా ఏ సమావేశం బల్లదగ్గిరో గంభీరంగా కూచుని కనిపిస్తూ ఉంటాడు, లేదా ఎవరితోనో కరచాలనం చేస్తూ ఉంటాడు. అంతర్జాతీయ సహకారానికి అతనొక పెద్ద చిహ్నం అనిపించేట్లు చేస్తాడు. తనకి తనే సాటి. అతనెవరనుకున్నారు? 'విదేశ సహాయం' పట్టుకొచ్చేవాడు! 'విదేశాలతో అప్పులు' అనే రాక్షసుడిని చంపబోయే వీరాధివీరుడు!

ఈ మధ్య మన వీరుడికి పని తగ్గుతూ వస్తోంది. త్వరలో నిరుద్యోగి అయిపోవచ్చు కూడా!

ఈ వ్యాసంలో సిలోన్‌కి సంబంధించిన విషయాలు కొన్ని రాస్తాను. ఇక్కడ 'విదేశ ద్రవ్య సహాయం' పట్ల సందేహాలు పెరుగుతున్నాయి. దాని మెరుగు 'కొంచెం' తగ్గినట్లు తోస్తుంది. పార్లమెంటు, పత్రికలు— ఇవి రెండూ మాత్రమేకాక, ప్రధాన మంత్రి శ్రీ డడ్లీ సేనా నాయక అభిప్రాయాలలోనూ మార్పు స్పష్టంగా కనిపిస్తోంది.

మార్చి 1965లో ఎన్నిక కాగానే శ్రీ సేనానాయక పెట్రోలు పరిశ్రమ జాతీయం చేసిన సమస్య గురించి మాట్లాడుతూ, శ్రీమతి బండార నాయక ప్రభుత్వం తొందరపడి చేసిన, 'జాతీయ కరణా'న్ని మారిస్తేగాని పశ్చిమ రాజ్యాల సహాయం తిరిగి ప్రారంభం అవదన్నారు. శ్రీ సేనానాయక అతి శీఘ్రంగానే పెట్రోలు కంపెనీలతో మంతనాలు ప్రారంభించి, వ్యవహారం ముగించారు.

1967 ఏప్రిల్‌లో శ్రీ సేనానాయక సిలోన్ కష్టాలు ఇంకా తీరలేదని అన్నారు. సహాయం వచ్చింది. తక్కువగా, ఆలస్యంగా వచ్చింది. కాని, వచ్చింది. వచ్చినా 1965 పరిస్థితి మీద అభివృద్ధి కనిపించలేదు. దీనికి కారణం, కొన్ని ముడివస్తువుల అంతర్జాతీయ ధరలు పడిపోవటమే. ధరలు పడిపోవటం వల్ల 25కోట్ల రూపాయలు (జాతీయ ఆదాయంలో ఎనిమిదవ భాగం) తక్కువ అయింది ఆదాయం. విదేశీ ద్రవ్య సహాయం ఈ తగ్గింపుని పూడ్చలేకపోయింది.

ప్రధాన మంత్రి అలా అన్నారు.

ఇక సిలోన్ పరిశ్రమల మంత్రి ఇటీవల కాండీలో ఒక పత్రికా సంపాదకుల సమావేశంలో మాట్లాడుతూ నిప్పులు కక్కారు. అంతర్జాతీయ సహాయ సంస్థలని దుయ్యబట్టారు. ముడిపదార్థాలకి న్యాయమయిన ధరలు ఇవ్వటం లేదన్నారు.

పుండుమీద కారం జల్లినట్లు, ఏప్రిల్ 2న అమెరికా తన ముడిరబ్బరు స్టాకులు విడుదల చెయ్యటం మొదలుపెట్టింది. పది రోజుల తర్వాత సిలోన్‌తో ద్రవ్యసహాయం ఒప్పందం చేసుకుంది. ఈరెండు ఒకదానికొకటి రద్దుచేసుకుంటాయని ఒక ప్రతిపక్షం శాసనసభ్యుడు (సంతోషంగా) అన్నాడు.

అంటే, సిలోన్‌వంటి వెనుకబడిన దేశాలు ఎంత ప్రయత్నించినా హటాత్తుగా అంతర్జాతీయ విపణులలో వచ్చే మార్పులని ఎదురుచూడలేక కష్టపడుతున్నారన్నమాట.

ఎగుమతి అయ్యే ముడిసరుకుల వెలలు పడుతూ ఉంటాయి; దిగుమతి అయ్యే యంత్రాల వెలలు పైకిపోతూ ఉంటాయి. ఇంకొక విధంగా చెప్పాలంటే, మనం బలహీనులమే కాము, సంరక్షణ అనేది లేకుండా ఉన్నాము. క్యూబాలో తుఫాను, వియత్నాంలో యుద్ధం, బర్మాలో దోపిడీలు—

సిటీలో ఏ ఒక్కటయినా చాలు మనల్ని బాధ పెట్టటానికి.

**టయర్ ఫ్యాక్టరీ**

మనల్ని ఇతరులు దుర్వినియోగించు కుంటున్నారంటాము, అనుకుంటాము కూడా. ఇలా అనుకోవడం మనకొక విధమయిన సంతృప్తిని ఇస్తుంది అంతేకాక, క్రమశిక్షణ నుంచి తప్పించుకొనటానికి సహాయపడు తుంది, కర్తవ్యం నెరవేర్చకుండా ఉండటానికి సహాయపడుతుంది.

వెనుకబడిన దేశాలకి అవసరమయినది కేవలం పెట్టుబడిమాత్రమేకాదు, సాంకేతిక నైపుణ్యాలు, నాయకత్వం, వివిధవృత్తులకి తగిన మనుష్యులు అంటాడు సుప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త గాల్‌బ్రెయిత్. క్రమ శిక్షణని కూడా ఈ జాబితాలో అయన చేర్చి ఉంటే ఎంతబాగుండేది!

ఇటీవలే ఈ దేశంలో జరిగిన దానిని వివరిస్తాను—

మార్చి 19: సోవియట్ ప్రభుత్వంలో విదేశ ఆర్థిక వ్యవహారాలశాఖ మంత్రి ఒక బృందంతో కొలంబోకి సోవియట్‌కి సహాయంతో నెలకొల్పిన టయర్ ఫాక్టరీ తెరిచే సందర్భంలో వచ్చారు.

మార్చి 20: సిలోన్‌కి కావలసినన్ని టయర్లనీ తనే చేసుకుంటుంది.

మార్చి 21: సిలోన్ 1970కి టయర్ల ఎగుమతి ప్రారంభిస్తుంది. 2.5 కోట్ల విదేశ మారకం పొదుపు.

మార్చి 22: 250,000 టయర్లు ప్రొజెక్టు మొదటి మెట్టో.

మార్చి 23: ఫాక్టరీని మంత్రిగారు ఆవిష్కరించారు.

మార్చి 31: ఫాక్టరీ కార్మికులందరూ సింగళ కొత్త సంవత్సరం ఎడ్వాన్సు విషయమయి 'వాకవుట్' చేశారు. (ఒక నెల జీతం.)

ఏప్రిల్ 1: 'స్ట్రయిక్' అధికం అయింది. ఇదీ కథ!

ఇదంతా ఇలా ఉండగా ఊథాంట్ ఇక్కడికి వచ్చారు. ఆయన్ని ఒక గొప్ప బౌద్ధుడి కింద అందరూ ఎంతో గౌరవం చేశారు. ఆయన నిజంగా బౌద్ధుడే. బౌద్ధ పూజలు, మర్యాదలు ఆయనకి కొత్తకాదు. అందుకనే, ప్రధాన మంత్రి డడ్లీ సేనా నాయక ఆయనతో మతం గురించి మాట్లాడేబదులు 'ముడివస్తువు'ల వెలని మాట్లాడారు. ఊథాంట్ 'ఇంకా గొప్పగా అవుతున్న గొప్పదేశాలు, ఇంకా బీద అయి పోతున్న బీద దేశాలు' గురించి చెప్పారు.

ఏమిచెయ్యాలి? బీదదేశాలన్నీ జట్టు కలవాలా? ఇది కొత్త సూచనకాదు. ఇటు వంటివి ఎన్నో ప్రయత్నించి వదిలివేశారు ఆ ఆ దేశాల నాయకులు. వారి ఆంతరంగిక వ్యవహారాలలో వారు మునిగి ఉన్నారు. అవి ముందు చక్కబడాలి! ఇది తేలికపనికాదు...

అంతదాకా 'పారిశ్రామిక, వ్యవసాయ దేశా'ల 'మధ్య విభేదాలు పెరుగుతూనే ఉంటాయి. తెల్ల, నల్లవారి మధ్య ఆర్థిక వ్యత్యాసాలుకూడా అధికం అవుతాయి. బస్తీ, పల్లెటూర్ల మధ్య విభేదమేకదా ప్రపంచ రాజకీయాలకి అన్వయిస్తుందని 'ఒక గొప్ప నాయకుడు' అన్నాడు. లిన్‌పియావ్ వింటున్నావా...?

(రచయిత 'సిలోన్ అబ్జర్వర్' విదేశ వ్యవహారాల సంపాదకుడు.)

—పో. వ. పి.




# లోకం పోకడ

—(ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీచరణ్ సింగ్ ఇంటిని 'ఘెరావ్' చేసిన సందర్భంలో) రెవెన్యూమంత్రి ఉదిత్‌నారాయణ్ శర్మ కారు డ్రయివరుని ఒక గ్రామసేవిక కాలిమీద కరిచింది.

25—5—67 హిందూస్తాన్ టయిమ్స్ వార్త.

* * *

—భారత దేశంలో లౌకిక సిద్ధాంతం చాలా వరకూ ఒక అభినయం, ఈ అభినయం నిల బెట్టటానికి కారణం విశ్వాసం సంపూర్ణంకాక పోవటమే.

19—5—67 'నవ్' వారపత్రిక.

* * *

—వారి భావాలనిస్వీకరించని గాంధీజీ ఎందరో యువకులని వాత్సల్యంతో చూసేవారు. అటు వంటి వారిలో ఒకరయిన డాక్టరు లోహియా దేశానికి పరమ నాయకులైన వారి తర్వాతి వారసుడనని వూహించినందుకు ఆ వారసత్వపు గౌరవం జవహర్‌లాల్‌నెహ్రూకి దక్కినప్పుడు ఆయన తనకి రావలసినదానిని దోచుకున్నట్లు వూహించినందుకు క్షమార్హులే.

20—5—67 మెయిన్‌స్ట్రీమ్‌లో సి. ఎస్. చిత్తరంజన్.

* * *

(కుడి కమ్యూనిస్టుపార్టీ) ప్రధానకార్యదర్శి శ్రీ రాజేశ్వరరావే, ఆంధ్రప్రదేశ్ స్వతంత్రపార్టీ 'పేదరయితుల పార్టీ' అన్నారు.

20—5—67 వీక్ ఎండ్ రివ్యూలో డి. కె. బోస్.

* * *

—అమెరికా ఏటాచేసే పెట్టుబడిలో పదవ భాగం, దేశంలో విదేశాలలోనూ కూడా, యూరప్‌లోనే వుంటున్నది. యూరప్‌లో అమెరికా నేరుగా చేసేపెట్టుబడి 1951 లో 400 కోట్ల డాలర్లు (విలువ తగ్గింపుముందు 1900 కోట్ల రూపాయలు) ఉంటే 1965 లో 1400 కోట్ల డాలర్లు (విలువతగ్గింపు తర్వాత 10500 కోట్ల రూపాయలు.)

1967 ఏప్రిల్ 'ఎన్‌కవుంటర్'లో క్రిస్టోఫర్ లేటన్.

* * *

—అంతస్తు, అయిశ్వర్యం, గౌరవం మని షికి బయటే ఉంటాయను కొనటం అవి లభించినప్పుడు సుఖం లభిస్తుందను కొనటం పొరబాటు, అవి లభించనప్పుడు దుఃఖం కలుగు తుందనుకొనటం పొరబాటు

21—5—67 భవన్స్ జర్నల్‌లో జగద్గురు కంచి కామకోటి శంకరాచార్యులు

# అధ్యక్షుని మరణం

## 2

విలియం మాంచెస్టర్



టెక్సాస్ వెళ్లడానికి ఆం డ్రూస్ ఎయిర్‌ఫోర్స్ బేస్‌లో అధ్యక్షునివిమానాన్ని ఎక్కడానికి వర్షంలో నడిచి వెళ్తున్న కెన్నడీ దంపతులు.

బైరన్ స్కెల్టన్ టెక్సాస్ నుంచి డెమొక్రటిక్ పార్టీ 'నేషనల్ కమిటీ' సభ్యుడు. చాలా మర్యాదస్తుడని పేరు సంపాదించుకున్నాడు. మూడు సంవత్సరాల క్రితం రోమన్ కాథలిక్ అయిన కెన్నెడీ హ్యూస్టన్‌లోని ప్రొటెస్టెంటు ఫాదరీలమధ్య సమావేశం ఏర్పరచి కెన్నెడీ కృతజ్ఞతకి పాత్రుడయ్యాడు. అతనికి ఎక్కడి పరిస్థితు లెటువంటివో బాగా తెలుసు. డల్లాస్‌లో వాతావరణం చాలా ప్రమాదకరంగా ఉందని పసికట్టాడు.

4—11—63 న రాబర్ట్ కెన్నెడీకి ఉత్తరం రాశాడు: 'నిజం చెప్పాలంటే, అధ్యక్షుడు తన యాత్రలో డల్లాస్‌ని రద్దుచేస్తే బాగుంటుందనుకుంటున్నాను', అని.

అంతటితో ఊరుకోనక జాన్సన్ కుడి భుజం అనతగ్గ వాల్టర్ జెన్కిన్స్‌కి ఉత్తరం రాశాడు, వాషింగ్టన్ వెళ్లి డెమొక్రటిక్ పార్టీ నేషనల్ ఛెయిర్మన్ జాన్ బెయిలీని కలిశాడు.

స్కెల్టన్ ప్రయాస ఫలితం ఒక పెద్ద సున్నా! రాబర్ట్ కెన్నెడీకి స్కెల్టన్ సలహా అంటే మంచి గౌరవమే కాని అతనిమాట ఎవరూ పట్టించుకోలేదు.

అంటే, కెన్నెడీని డల్లాస్‌లో హత్య చేస్తారని స్కెల్టన్ కూడా ఊహించలేదు. ఏదో గొడవ వస్తుందని మాత్రం భయ పడ్డాడు. ఆ ఊరి కీర్తి అటువంటిది.

1960 లో ఒక గృహిణుల గుంపు జాన్సన్‌మీద తమ ఉమ్మివర్షం కురిపించారు.

అక్టోబర్ 24 తేదీ ఎడ్లాయి స్టీవెన్సన్ మీద అక్కడ కొందరు చెయ్యి చేసుకున్నారు. అందుకనే అధ్యక్షుడి ప్రత్యేక సలహాదారు ఆర్థర్ ష్లెసింగర్ స్టీవెన్సన్‌కి ఫోన్ చేశాడు. డల్లాస్‌లో చెలరేగి ఉన్న ద్వేషం తనని చకితుడిని చేసిందన్నాడు స్టీవెన్సన్. అధ్యక్షుడు అక్కడికిరావటం మానుకుంటే బాగుంటుందా, అన్నాడు. కాని, తర్వాత తిరిగి టెలిఫోన్‌చేసి రావచ్చు నన్నాడు. మొదటి కంగారులో అలా చెప్పి ఉంటాడని ష్లెసింగర్ అనుకున్నాడు.

ఇది సరికాదేమో? ఆ ప్రాంతం వారికి దాని సంగతి బాగా తెలుసు. టెక్సాస్ పక్క రాష్ట్రానికి చెందిన సెనెటర్ జె. ఫుల్‌బ్రయిట్—ఇతను విశాల దృక్పథం కల వాడు—డల్లాస్‌ని నమ్మేవాడు కాదు. అక్టోబర్ 3 వ తేదీన అధ్యక్షుడితో, 'డల్లాస్ ప్రమాదకరమయినచోటు. నేను మాత్రం అక్కడికి వెళ్లను,' అన్నాడు. 'మీరూ వెళ్లకండి!'

డల్లాస్‌లో ఆందోళన సంగతి సరేసరి. ఎందరు ఎన్నో విధాలుగా భయపడ్డారు. అక్కడి రెండు పత్రికలూ నిగ్రహం అవసరం అని ఉద్ఘాటించాయి. 'పోలీసు చీఫ్' జెస్సెక్రీ తన శాఖ ఎటువంటి అసభ్య ప్రవర్తననీ సహించదన్నాడు. ఊళ్లో పోలీసు దళాన్ని పెంచాడు. ఎక్కడచూసినా రక్షక భటులే కనిపించారు!

ఇక హెచ్చరికలకి అంతులేదు. ఆ తర్వాత ఘోరం జరిగింది. వాటి రెండిటిమధ్య అగాధాన్ని అనుశీలించటం సాధ్యంకాదు. హత్య జరిగిన పదినెలలతర్వాత వారన్ కమిషన్ నిర్ణయం: 'లీ ఆస్వాల్డ్ నేరానికీ, డల్లాస్‌లోని (రాజకీయ) వాతావరణానికీ సంబంధంలేదు,' అని నిర్ణయం అభిప్రాయ సేకరణద్వారా బయటపడింది. కొందరు మాత్రం తమ సందేహాలని తమే ఉంచుకున్నారు. నిర్ణయాన్ని అవసరంమీద చేశారు. ఆ నిర్ణయానికి బహుళప్రచారం లభిస్తుందని కమిషన్ మెంబర్లు ఆశించారు. అధికసంఖ్యాకులు డల్లాస్‌పట్ల తమ ఊహలు తమ ఇతర పరిశోధనల ఫలితాలని ఖండిస్తాయని భయపడ్డారు. తటపటా

యించారు. హంతకుడికి డల్లాస్‌లో ఏర్పడిన తీవ్రవాతావరణం గురించి తెలుసుగాని, 'ఆనగరంలో కుతకుతలాడుతున్న రాజకీయ వాతావరణం యొక్క ప్రభావం అతనిమీద ఏవిధంగా పనిచేసిందో నిర్ణయించటం వీలు కాదు' అని తీర్మానించారు.

'నిర్ణయం' అనేపదాన్ని గమనించాలి. వ్యక్తికీ, వాతావరణానికీ మధ్య సంబంధాన్ని సూక్ష్మంగా సూత్రీకరించడం సాధ్యంకాదు. కాని చర్చలో ఊహాగానం చేసితీరాలి. సవ్యమయిన ఊహాగానం చరిత్రకారుల కర్తవ్యాలలో ఒకటి. వారు వేలిముద్రలు, సాంకేతిక పరీక్షలతో ఊరుకుంటే లాభంలేదు. డల్లాస్ హంతకుడు ఏ హత్యాకుట్రలోనూ పాల్గొనలేదు. అతను అంతా తనే సొంతంగా చేశాడన్నారు. కాని ఇది సరికాదు. అతని బుద్ధి సంకుచితమయినదే. అసలు హంతకు లందరి బుద్ధులూ సంకుచిత మార్గంలో ప్రయాణించేవే కాని, ఏ మానవుడూ శూన్యంలో బ్రతకడుకదా! అతని ప్రతి క్రియమీదా అతని జీవించేకాలం, సమాజం వాటి ప్రభావాలు ఉంటాయి. లింకన్‌ని చంపిన జాన్ విల్క్స్‌బూత్ కన్ఫెడరేట్ ఏజంటుకాదు. ఎవరు ఏది ఊహించినా హత్య స్వంతబాధ్యత పయినే చేశాడు. కాని హత్యచెయ్యబడ్డ వ్యక్తి చరిత్రలో ఒక క్లిష్టతరమయిన క్షణంలో హత్యగావింపబడ్డాడు - దక్షిణాది రాష్ట్రాలపట్ల సానుభూతికలవాగి మాటలతో బండబారిన ఒక నగరంలో.

ఒక వాతావరణానికీ, అందులో జరిగిన నేరానికి మధ్య సంబంధాన్ని సూక్ష్మంగా కొలవటం కాని పని. అయినప్పటికీ లింకన్ హత్య ప్రశాంతంగా ఉన్న రాజకీయ వాతావరణంలోనూ జరిగి ఉండవచ్చుననటం హాస్యాస్పదం.

అది కెన్నెడీ అధ్యక్షతకింద మూడో ఏడు. డల్లాస్ పరిస్థితి ఆరోగ్యకరమయినదికాదు. ఈ పరిస్థితి కేవలం రాజకీయాలతో సంబంధంకలది కాదు. అది ఆత్మకే పట్టుకున్న జబ్బు. అక్కడి సమాజంలోని అనారోగ్యాన్ని తెలిపే హెచ్చుస్థాయిలోని అపస్వరం. అమెరికాకెల్లా టెక్సాస్‌రాష్ట్రంలో హత్యలు అధికం. ఇక టెక్సాస్‌లో డల్లాస్‌లోనే హత్యలసంఖ్య ఎక్కువ. అమెరికాలో దేశం మొత్తంమీదకన్నా ఈ ఒక్క నగరంలో ఖూనీలు అధికం. అంతేకాక, హత్యలలో సుమారు 72 శాతం తుపాకీలతో జరిగేవే. డల్లాస్‌లో తుపాకులకి లయిసెన్సు అనవసరం.

1963లో నవంబర్ 22 దాకా డల్లాస్‌లో మాత్రం 110 ఖూనీలు జరిగాయి!

ఒక్కడల్లాస్‌లోనే అధ్యక్షుడిమీద అంత ద్వేషం ఉందా? ఈ ప్రశ్నకి జవాబు చెప్పటం కష్టంకాని డల్లాస్‌లో మాత్రం అత్యాచారానికి గౌరవం లభించింది. జాన్‌ఎఫ్ కెన్నెడీ నెలకొల్పిన 'న్యూ ఫ్రాంటియర్' సిద్ధాంతాలు ఇక్కడి నవవిద్వేషకులకి నచ్చవు. కెన్నెడీ కొత్త ఎల్లలకన్నా పూర్వం ఏవో ఎల్లలుండేవని కలలు కనేవారికి అతని ఆయిశ్వర్యం, తూర్పుయాస ఎలా నచ్చుతాయి?

కాని, కెన్నెడీ అసలునేరం — డల్లాస్ దృష్టిలో ఇదంతాకాదు. కెన్నెడీ నిదానంగా ఆలోచించే మనిషి. 'పాతఎల్లల'లో అలోచించి జీవించటం అసాధ్యం. కెన్నెడీ వైవిధ్యం, సహనం, గుడ్డి అనుకరణపట్ల అపనమ్మకం కలవాడు. కొత్త ప్రదేశాలలో జట్టుకలవనివారు ప్రమాదాలకి లోనయ్యేవారు. పాతకాలాలలో బళ్ళలో ప్రయాణాలు చేసేవారు రెడ్‌ఇండియన్లని ఎలా కలిసికట్టుగా ఎదిరించేవారు? వారిమధ్య దిగబడ్డ 'తూర్పుమనిషి' వారికొక ప్రమాదమే కదా! (అమెరికాకి వలసవచ్చినవారు తూర్పుతీరంమీదనే దిగారు. క్రమంగా పడమరవెళ్ళారు. అందుకే 'వైల్డ్‌వెస్ట్' అంత ప్రచారంలోకి వచ్చింది!)

అంటే అక్కడివారికి నీతినియమాలు తక్కువ అనికాదు. పాపభీతి కావలసినంత ఉంటుంది. ఇతరుల దృక్పథం అర్థంచేసుకొనటం మాత్రం వారికి చేతకాని పని.

నవంబర్ 21: పొద్దున ఫలహారం ముగించి అధ్యక్షుడు వల్లటి బ్రేస్‌వేసుకుని, బూట్లలేస్ ముడివేసి—ఎడమబూటు అర అంగుళం ఎక్కువ మందం కలది, డాక్టరు సలహాప్రకారం - బట్టలు వేసుకుని, 26 డాలర్లనోట్లుకల పర్సు జేబులోపెట్టుకుని (ఈ పర్సుకి సెయింట్ క్రిస్టోఫర్ బొమ్మ బంగారు క్లిప్ ఒకటి ఉంది) పైకి తను యుద్ధంలో 'పి. టి.' పడవలోచేసిన సేవకి చిహ్నం అయిన క్లిప్ ఒకటి ధరించి ప్రయాణానికి సిద్ధం అయ్యాడు.

అప్పుడే ఏదో ముఖ్యమయిన పనిమీదబయలుదేరే పిల్లలుగల అమెరికన్ పెద్దమనిషిలాగ తయారయ్యాడు. నిజానికి అంతేకదా!

'కారొలీన్!' అని పిలిచాడు. 'జాన్!' ఇద్దరూ పరిగెత్తుకుని వచ్చారు, జాన్ నిక్కరు వేసుకుని, కారొలీన్ నీలంవెల్వెట్ గవును వేసుకుని. వాళ్ళ అమ్మ తలదువ్వించుకుంటోంది. అందుచేత ఈ ఇద్దరూ పొద్దున ఫలహారందగ్గిర కులాసాగా తండ్రితో కబుర్లు చెబుతూ కూర్చున్నారు. అతనేమో గబగబ ఉదయం పత్రికలు చూస్తూ వాళ్ళమాటలు వింటున్నాడు. 9—15 కి అధ్యక్షుడిగారి అమ్మాయి స్కూలు టయిము అయింది. తండ్రిని కావలించుకుని, 'బయ్ డాడీ!' ('బయ్ కారొలీన్!') అని వెళ్ళిపోయింది.

'వెస్ట్‌వింగ్' లో అధ్యక్షుడు తన కార్యదర్శి ఎవిలిన్ లింకన్‌కి ఫోన్ చేశాడు 'ఈ వాతావరణం సమీక్ష ఏమిటి?' అని అడిగాడు. బ్రిగేడియర్ గాడ్‌ఫ్రే మెక్‌హ్యూగ్ పంపిన రిపోర్టుని చూపించాడు. 'దాన్ని కాస్త తనిఖీ చేయించాలి!'

10—42 కి ఆమె 'దుర్వార్త'తో తిరిగి వచ్చింది. 'టెక్సాస్‌లో' మరుసటి రెండు రోజులూ బాగా ఎండగా ఉంటాయి.

'ఎండగానా?' కెన్నెడీ చిరాకుతో లేచి భార్య పరిచారిక గదికి ఫోన్ చేశాడు. 'ఆవిడకి కొన్ని ఎండకి పనికివచ్చే బట్టలు కూడా సర్దు!' అన్నాడు.

కాని అప్పటికే ఆలస్యం అయిపోయింది. దుస్తులు అప్పటికే హెలికాప్టర్‌లో వెళ్ళిపోయాయిట! కెన్నెడీ తిట్టుకున్నాడు. భార్య ప్రయాణం కులాసాగా జరగాలని తనువేసిన కార్యక్రమం అంతా దండగ అయిపోయింది. డల్లాస్‌లో మోటారుకారు ఊరేగింపులో ఆమె చెమటలు కక్కుతూ వెళ్ళటమా! మెక్‌హ్యూగ్ పెద్ద పొరపాటు చేశాడు. చల్లగా ఉంటుందన్నాడు. దేశంలోని మిలిటరీ వాతావరణ నిపుణులందరినీ అడిగి సమాచారం సేకరించాడు. అంతా సైనిక దళం సమాచారం! తప్పిపోయింది! వళ్ళు మండిపోతున్న కెన్నెడీ మెక్‌హ్యూగ్‌ని పిలిచి తలవాచేట్లు చివాట్లుపెట్టాడు. తర్వాత వోడానెల్‌ని పిలిచాడు.

'కెన్నీ! ఎక్కడి విమానాశ్రయంలో

# అధ్యక్షుని మరణం

అక్కడ అడిగి తెలుసుకుందాంరా!' అని కేకలు వేశాడు. 'పద్దు, మిసెస్ లింకన్‌ని కనుక్కోవా! సరిగ్గానన్నా అడుగుతుంది! అంతేకాక దండగకర్చు చెయ్యదు!' మరి కొంత తిట్టుకున్నాడు. 'ఎండ! ఎండ! జాకీ గుడ్డలన్నీ పద్ది అయిపోయింది—అన్నీ తప్పుడు గుడ్డలే!' మరోకతిట్టు. ఆఫీసు వదిలి వెళ్ళిపోయాడు...

రెండవ అంతస్తులో తన భార్య పరిచారిక దగ్గరికి వెళ్ళాడు. 'జాన్‌ని వెంట తీసుకు వెడుతున్నాను, తయారు చెయ్యండి!' అన్నాడు.

జాన్ సంతోషానికి అంతులేదు. క్షణాల మీద అతనికి చిన్న రెయిన్‌కోటు వగయిరాలు వేశారు.

అందరూ హెలికాప్టరువద్దకి వెళ్ళారు. ఇవిలిన్ లింకన్, మేజర్ జనరల్ టెడ్ క్లిఫ్టన్ ఇంకా ముగ్గురు ఏజంట్లు నెం.1 హెలికాప్టరులో ఎక్కిఉన్నారు. జాన్ వాళ్ళతోబాటు అందులో కూర్చున్నాడు. అధ్యక్షుడి డాక్టరు జార్జి బర్క్లీ నెం. 2 హెలికాప్టరులో ఎక్కాడు. పత్రికావిలేఖరులు వగయిరా నెం. 3 హెలికాప్టరులో ఉన్నారు. సన్నటి జల్లు ప్రారంభం అయింది. టోపీ ధరించని కెన్నెడీ చురుకుగా నెం 1 లోకి ఎగిరి ఎక్కాడు. ఇంతలో గులాబీతోటలో నుంచి జాక్వెలిన్ కెన్నెడీ వచ్చింది. తెల్లటి ఉన్ని సూట్ వేసుకుని ఉంది. చలికాలం దుస్తులు! కెన్నెడీ ఒకసారి ఊపిరిబిగపట్టి మెక్‌హ్యాగ్ వంక ఉరిమిచూసి ఊరుకున్నాడు! ఆమె విమానం ఎక్కగానే పైన ప్రొపెల్లర్ రెక్కలు తిరగటం మొదలు పెట్టాయి...

అధ్యక్షుడి రక్షణకోసం అంకెలు కూడా మారుస్తారు. అతనుండే 'వైట్ హవుస్' పేరు 'కాసెల్' అయిపోయింది; పర్యటనలో అధ్యక్షుడు ఎక్కడ అంటే ఆ చోటుని 'చాంక్లెల్' అని పిలిచేవారు; కెన్నెడీ పేరు 'లాన్సర్' అయింది; అతని భార్యపేరు 'లేస్'; కుమార్తెపేరు 'లిరిక్', కొడుకు పేరు 'లార్క్' రక్షకభటుల పేర్లన్నీ 'డి' అక్షరంతో మొదలయ్యేట్లు మార్చారు. పరివారంలోని వారందరి పేర్లూ 'డబుల్యూ' అక్షరంతో ప్రారంభం అవుతాయి. 'వి' ఉపాధ్యక్షుడివార్నికి—జాన్సన్ 'వాలంటీర్' అతనిభార్య లేడీబర్డ్ 'విక్టోరియా' అయిపోయారు.

సాధారణంగా అందరూ 1500 పెన్సిల్వేనియా ఎవెన్యూయే 'వైట్‌హవుస్' అనుకుంటారు. ఇది పొరపాటు. అధ్యక్షుడు ఎక్కడ ఉంటే అది వైట్‌హవుస్ అవుతుంది. అక్కడికివచ్చిన టెలిఫోన్ కాల్‌లు అన్నీ అధ్యక్షుడు ఉన్నచోటుకి ఆటోమేటిక్‌గా మారివెడతాయి.

'ఏండ్రూస్ ఎయిర్‌ఫోర్స్ బేస్'లో దిగింది నెం 1 హెలికాప్టరు. పక్కనే 'ఎయిర్ ఫోర్స్‌వన్' విమానం—వాయునౌక—సిద్ధంగా ఉంది. జాన్ తలిదండ్రులు అతన్ని కావలించుకుని సెలవు తీసుకున్నారు. 'నేనూ వస్తా,' అన్నాడు చిన్న జాన్ తండ్రితో.

'ఇప్పుడుకాదు,' అని నెమ్మదిగా చెప్పాడు కెన్నెడీ.

చిన్న పిల్లవాడు ఏడవటం మొదలు పెట్టాడు.

అధ్యక్షుడు తన చిన్నకొడుకుని చివరిసారిగా ముద్దు పెట్టుకున్నాడు. రెయిన్ కోటుకింద వణుకుతున్న అతని చిన్న భుజాన్ని తట్టాడు. తర్వాత వెనకే ఉండిపోతున్న ఒక సీక్రెట్ సర్వీస్ ఏజంటుతో, 'మావాడ్ని కనిపెట్టండి మిస్టర్ ఫాస్టర్!' అన్నాడు.

ఆ ఉదయం డల్లాస్‌వీధుల్లో 5000 కరపత్రాలు కనిపించాయి. పైన ఆఫ్‌సెట్‌లో ముద్రించిన అధ్యక్షుడి ముఖం చూపే ఫోటోలు రెండు ఉన్నాయి. ఒకటి ముందరనుంచి తీసినది, మరొకటి పక్కనుంచి తీసినది. అంటే, పోలీస్‌శాఖవాళ్ళు వేసే పోస్టర్‌లాగ ఉందన్నమాట. ఫోటోల కింద—

'దేశద్రోహి ఇంకా పట్టుబడలేదు' అనే పెద్ద అక్షరాలు ముద్రించి ఉన్నాయి. వీటి కింద ఇంకా, 'ఈమనిషి యునయిటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాకి ద్రోహం చేసినవాడు. ఇంకా పట్టుబడలేదు' అనేవాక్యాలు, కెన్నెడీ దేశద్రోహాన్ని వివరించే 7 కారణాలు ఉన్నాయి.

ద్వేషాన్ని రగిలించే ఇంధనం ఇందులో చాలా ఉంది.


DAVANGERE
COTTON MILLS LTD
RH
Quality





లాంటి, దాని ప్రాముఖ్యాన్ని ఎక్కువ చెయ్యనక్కరలేదు. ఈ కరపత్రాన్నివేసిన వారికీ కెన్నెడీ హంతకుడికీ సంబంధం లేదు. డల్లాస్‌లో అప్పటికే కెన్నెడీ ద్వేషం పెల్లుబికి ఉంది. ఒక స్కూలుటీచరు తన పిల్లలతో 'మీ తలిదండ్రులు వెంట ఉంటే

## అధ్యక్షుని మరణం

అధ్యక్షుడి కారు ఊరేగింపుకి వెళ్ళవచ్చు' నన్నాడు. మరొక ఉపాధ్యాయిని తన విద్యార్థులని ఎట్టి పరిస్థితులలోనూ పంపించనన్నది. ఆమె వయసు సుమారు పాతిక ఉంటుంది. 'వాడిని చూస్తే మొహంమీద ఉమ్మేస్తాను' అన్నది సన్నగా నవ్వుతూ.

గంటతర్వాత 'టయిమ్స్ హెరాల్డ్' పత్రిక మధ్యాహ్న ఎడిషన్ వెలువడింది. 'టెక్సాస్ స్కూల్ బుక్ డిపాజిటరీ'లో పనిచేసే ఒక గుమాస్తా దాన్ని గాలిలో ఆడిస్తూ లోపలికి పరిగెత్తాడు. పత్రికలో అధ్యక్షుని ఊరేగింపుమార్గం పటంవేశారు. మోటారుకారు ఊరేగింపు తమ కట్టడం పక్కగా, తమ కిటికీలకిందుగా వెడుతుంది!

అధ్యక్షుడి విమానం ఏండ్రూస్‌ని 11.05కి వదిలివెళ్ళింది. పయిలెట్ పేరు జిమ్ స్వెండాల్. అలబామా రాష్ట్రానికిచెందిన వాడు. చలాకీ మనిషి. చక్కటి వాయు నౌకని నడుపుతున్నాడు - వంద టన్నుల బరువుకల యంత్రం, సూక్ష్మమయిన నిర్మాణం కలది, ఎయిర్‌కండిషనింగ్ చేసినది, లోపల నిశ్శబ్దంగా ఉండేది.

ఉదయం అధ్యక్షుడు తన పచ్చ మొసలి తోలు సంచి విప్పి కాగితాలు చూసుకుంటున్నాడు. వాటిలో కొన్ని టెలిగ్రామ్‌లు ఉన్నాయి. అతి రహస్యమయినవి. పక్కనే భార్య, పామ్‌టుర్నార్ ఒక ఉపన్యాసం తయారుచేస్తున్నారు. టెక్సాస్‌లో ఆమె చెయ్యబోయే ఉపన్యాసం అదొక్కటే. చాలా చిన్నది. 'లీగ్ ఆఫ్ యునయిటెడ్ లాటిన్ అమెరికన్ సిటిజెన్స్' ముందు చెయ్యబోయేది కాబట్టి స్పానిష్‌లో తయారు చేసింది. వాయువౌక స్టేట్‌రూమ్ విశ్రాంతిలో ఆమె స్వచ్ఛమయిన స్పానిష్ ఉచ్చారణ స్పష్టంగా వినిపిస్తోంది...

కింద ఎక్కడో యార్బరో ధుమధుమ లాడుతున్నాడు. కొన్నలీ వేసిన వల వివరాలు తెలుసుకున్నాడు. జాన్సన్-కొన్నలీలు కలిసి చేసినదని అతని నమ్మకం. ఎంత శత్రువయిన రిపబ్లికన్ పార్టీవాడు కూడా ఇంత ఘోరంగా ప్రవర్తించడనుకున్నాడు...

ఆస్టిన్ సన్మానం గురించి అతన్ని జిమ్ మాతియూస్ అనే పత్రికా విలేఖరి అడిగాడు. 'కొన్నలీకి ప్రభుత్వం మర్యాదలేమి తెలుసు? అంతే!' అన్నాడు యార్బరో.

విరివిరోధం రచ్చకెక్కింది. అధ్యక్షుడి విమానం (దాని అంకె 26000) దిగగానే యార్బరో మాటలు పత్రికా విలేఖరులకి చేరిపోతాయి.

(ఇంకా వుంది)







# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఎత్తి లేటిలు

## ఉపశమనముతో సహా రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది!

దగ్గు, జలుబులతో నీర్సముగా ఉండి రోగనిరోధక శక్తిని కోల్పోతారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశముంది.

వాటర్‌బరీస్ కాంపౌండులో గల ఓషధులు ఆకలిని వృద్ధి చేస్తాయి, కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి, ఇతర వ్యాధులు కలగకుండా రోగనిరోధక శక్తిని యిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియొసోట్' మరియు 'గయొకోల్' దగ్గు, జలుబుల నుండి ఉపశమనమును కలిగిస్తాయి.




**బలము మరియు ఆరోగ్యమునకు**
**వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి!**




వార్నర్-హిందూస్తాన్ లిమిటెడ్

# గోల్డ్ ఫింగర్-24

## జేమ్స్ బాండ్ బొమ్మల సీరియల్










బాండ్‌కి ఏదో అసంతృప్తిగా ఉంది. ఈ 'కేసు' పూర్తికాలేదు, అది అతనికి ఇష్టంలేదు.....

("గోల్డ్‌ఫింగర్, బులియన్‌లని పట్టుకురమ్మని నా ఆర్డర్లు. సాధించలేకపోయారు...")

("కేవలం ఒక అద్భుతంవల్లనేకదా ఆపరేషన్ గ్రాండ్ స్లామ్ దెబ్బ తిన్నది. ఏమిటీ?")

"మిస్టర్ జేమ్స్‌బాండ్ టికెట్ కవుంటర్‌వద్దకి రావాలి, దయచేసి......."

"ఏమిటీ? ఇన్‌కంటేక్స్ కాగితాలేమన్నా....?"

"మీ హెల్త్ సర్టిఫికేట్లు చూపిస్తారా మిస్టర్ బాండ్?"










బాండ్‌కి అర్థంకాలేదు బయటికివెళ్లేదారిపద్ద మనుష్యులే లేరు.....

"గాండర్‌లో టయిఫాయిడ్ కేసు ఒకటి ఉంది లెండి! ట్రాన్సిట్ ప్రయాణికులందరికీ ఇనాకులేషన్ ఇస్తున్నాము...."

"నాకీ సూది పొడువులంటే అసహ్యం—అయినా ఏమిటీ వాళ్ల భయం? బ్లాక్ డెత్ వస్తుందనా......"

"చివరివారా? ఓకే! ఎడంచెయ్యిపైకెత్తండి.."

సారాయం వాసన గుప్పుమంది. సూది చురుక్కుమంది. అంతే.....










వికారంమధ్యలో బాండ్ ఆలోచనలు సుడులు తిరిగాయి......

"హాయ్ అందగాడా...."

"పుస్సీ...."

"ఏమిటిదంతా? నువ్వెక్కడనుంచి వచ్చావు? ఆ కోతి ఎవరు?"

"20,000 అడుగుల ఎత్తున కేవియర్ చేప తింటున్నావు, షాంపేన్ తాగుతున్నావు!"

"కంగారుపడకు! మామ నీతో మాట్లాడుతాడు....."

"నా కసలు ఆశ్చర్యమే వెయ్యదిక నయినా!"










"మిస్టర్ బాండ్, విధి మన ఆట పూర్తికావా లంటోందన్నమాట. ఇక చెప్పండి ఎలా సాధించారు? ఎలా సందేశంపంపారు?"

"నాకు బూర్బన్ విస్కీ, సోడా, అయిస్, సిగరెట్లు తెప్పించి విడిపిస్తే మాట్లాడ్తాను గోల్డ్ ఫింగర్........"

"నువ్వు నాకు తగిన శత్రువువే! నువు చెప్పి వట్లే చేస్తానుకాని అవసరమయితే వెంటవే చంపిం చేస్తాను!"










అయిదు నిముషాల తర్వాత బాండ్ కోరికలు నెరవేరాయి........

"థాంక్స్‌పుస్సీ. ఇప్పుడు చెప్పు గోల్డ్‌ఫింగర్ ఇదంతా ఏమిటి? ఈ విమానం ఎలా సంపాదిం చావు?"

"గ్రాండ్‌స్లామ్ నాశనమవగానే హత్తరాస్ కేప్‌కి వెళ్లాను. నలుగురు దొంగలనీ కాల్చి చంపే శాను. మిస్‌గాలోర్‌ని మాత్రం ఉంచాను. తర్వాత దబాయించి, మెదలువంచి అయిడిల్ వయిల్డ్‌లో ఈ విమానం సంపాదించాను...."

"నా మనుష్యులు ముగ్గురు ఒకప్పుడు జర్మన్ విమానదళంవారు. మనమిప్పుడు సోవియట్ భూమి మీదకి పోతున్నాము. సరే, నా ప్లాన్‌లు ఎలా నెడ గొట్టారు మిస్టర్ బాండ్?"










బాండ్ అసలు కథని కొంచెం కత్తిరించి చెప్పాడు.

"ఎలాగో కబురు పంపాను—మీకెందుకు? మీ జపాన్ నీటి సప్లయి విషంవాళ్లు మాకు చిక్కారు. అంతా సరిగ్గా ఉందని మీకు కబురు పంపారు...."

"అమెరికన్ సేన ఫోర్ట్‌నాక్స్ ప్రజలు మీకోసం, మీ ముటా నాయకులకోసం కాచుకుని ఉన్నారన్న మాట. దబాయించటం, దవుర్జన్యాలు చెయ్యటం మీ కొక్కడికేకాదు వచ్చింది గోల్డ్‌ఫింగర్!"

ఇంతదాకా బాండ్ తను ఏకాకి అనుకున్నాడు. కాని గ్లాసుతో సందేశం ఉంది.

"నేను నీ వైపే......పుస్సీ."

(ఇంకా ఉంది)

సీరియల్

# పూర్వా సంధ్యా ప్రవర్తతే...

తేజోవతి

### జరిగిన కథ

యస్. యస్. యల్. సి. పరీక్షల్లో వేణు కాపీలు పట్టుకుంటాడు శంకరం మేష్టారు. శంకరం గారి మంచితనాన్ని గ్రహించిన వేణు అక్కయ్య జ్యోతి వేణుని శంకరంగారి దగ్గరకి ట్యూషనుకు పంపిస్తుంది. జ్యోతి స్నేహితురాలు రాధ అన్న మోహన్‌ని ప్రేమిస్తుంది. కాని కట్నంకోసం ఆశించిన అతన్ని తిరస్కరించి జ్యోతి బావ ఆనందరావును వివాహం చేసికొంటుంది. శంకరంగారిమీద లేనిపోని అపోహను ఏర్పరుచుకొని వరదరాజులుగారు ఆయనమీద పగ బడతాడు. యస్. యస్. యల్. సి. రిజల్ట్సు సరంభంలో పాలుపంచుకోలేకపోయిన వేణు తన యీ స్థితికి కారణమయిన శంకరంగారిమీద పగతీర్చుకుందామని వెళ్ళిన వాడు ఆయన అసలు వుద్దేశాన్ని గ్రహించి గట్టిగా చదివి ప్యాసు కావటానికి కృతనిశ్చయుడవుతాడు.

## 7

పంచలో జానికమ్మగారు నిలబడి యింకో ఆవిడతో మాట్లాడుతోంది... ఆవిడ సీతమ్మగారు...హరి వాళ్ళ అమ్మ...

'అమ్మా!... అంతా మీ దయ ... మీ ఆశీర్వాదం...అబ్బాయి పాసయ్యాడంటే మీ చలవేనమ్మా...' అని అంటోం దావిడ...జానికమ్మగారు హరికి జీతం కట్టడానికి సీతమ్మగారికి నెలకో రూపాయి యిస్తుండేది... హరికి ఓ రోజు వారం కూడా యిచ్చేవాళ్ళు. ఆ విశ్వాసంతోనే సీతమ్మగారు ఆ శుభవార్త చెప్పడానికి ఆ వేళప్పుడు పరుగెత్తుకొచ్చింది...

'మాదేముందమ్మా ... కష్టపడి చదివాడు పాసయ్యాడు...అదృష్టవంతురాలివి ...ఒక్క కొడుకైనా బుద్ధిమంతుడు...' అంది జానికమ్మగారు...

ఆ క్షణంలో సంతోషంతో, గర్వంతో పొంగిపోతున్న మాతృమూర్తి సీతమ్మగారితో బలవంతాన నవ్వుతెచ్చుకుని మాట్లాడుతున్న తల్లిని పోల్చి చూసుకున్న వేణుకు తన గుండెల్ని ఎవరో పిండుతున్నట్లనిపించింది.

'కాలేజీలో చేర్పిస్తారా...' అని అడిగింది జానికమ్మగారు.

'ఇంకా నేనేం చెప్పించగలనమ్మా?... ఏ కొలువో నేర్చుకుని ఏదో బతుకుతెరువు చూసుకోవాల్సిందే గాని...చీకటి బడింది... నే వస్తానమ్మా...' అని చెప్పి వెళ్ళిపోయింది సీతమ్మగారు...

ఆవిడ వెళ్ళిపోయ్యాక జానికమ్మగారు అత్తగారివైపు తిరిగి, 'అవకాశాలు వున్న వాళ్ళకు చదువుమీద ఆసక్తి వుండదు... ఆసక్తి వున్న వాళ్ళకు అవకాశాలు తక్కువ అత్తయ్యగారూ!...' అంది...

వేణుకు యీ మాటలు బాకుతో పొడిచినట్లు అనిపించాయి. తల్లికి ముఖం చూపలేక తలొంచుకు లోపలికి వెళిపోయ్యాడు...తొలిసారిగా తన బాధ్యత తెల్సుకున్న వేణు తనూ కష్టపడి చదవాలన్న కృతనిశ్చయంతో పుస్తకం తెరిచాడు...

అప్పటికే జూన్ నెల వచ్చేసింది. ఇక మిగిలింది మూడు నెలలు. ఇప్పుడిప్పుడే కాలం విలువ తెల్సుకుంటున్న వేణు సాయంత్రం ఆరు గంటలకల్లా భోజనం ముగించుకుని శంకరం గారింటికి వెళ్ళడం, రాత్రి పది దాకా అక్కడ చదువుకుని ఇంటికి రావడం, మళ్ళీ తెల్లవారుజామున లేవడం. అలా జరుగుతోంది అతడి దిన చర్య...

శంకరంగారికి స్కూల్ తెరిచారు. స్కూల్లో పూపిరి సలుపని పని. క్లాసులు గూడా అన్నీ వరుసగా వేశారు...ఏ నాడూ తన కర్తవ్య నిర్వహణలో లోటు రానివ్వని శంకరంగారి మీద ఏదో మిషమీద 'ఎక్స్‌ప్లనేషను' మెమోలు వస్తున్నాయి. ఉన్నట్టుండి హెడ్‌మాష్టరుగారికి తనమీద యింత ఆగ్రహం ఎందుకు వచ్చిందో అంతు బట్టని శంకరంగారు 'నారోజులు బాగుండ లేదు' అని నిట్టూర్చి వూరుకుంటున్నారు. స్కూల్ కమిటీలో గూడా శంకరంగారిని ఆ స్కూలు నుండి ట్రాన్స్‌ఫర్ చెయ్యాలని తర్జనభర్జనలు జరుగుతున్నాయి. ఈ రోజుల్లో ముక్కుకు సూటిగా పోయి తన కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటే అధికారుల మెప్పుకు బదులు, యిలాంటి తుఫానులే ఎదురుకోవల్సి వస్తుందని తెలియని శంకరం గారు, తను చేసిన అపరాధమేమిటో కమిటీ మెంబర్లలో ఒకరికి తన మీద అంత ఆగ్రహం రావడానికి గల కారణమేమిటో అంతుబట్టలేదు...వరదరాజులుగారు కన్పిస్తే ముఖం తిప్పుకుంటున్నారు. వీట న్నిటికీ తోడు, శంకరంగారి తల్లికి జబ్బెక్కువ అయింది. ఆవిడకు మందు తేవడానికి హాస్పిటల్‌కు వెళ్ళిన రోజున 'లేటు'గా వచ్చేందుకు 'పర్మిషన్' యివ్వటం లేదు హెడ్‌మాష్టరు. శంకరంగారు కష్టాల్లో మునిగి తేలుతుంటే వేణు తన చదువులో మునిగి తేలుతున్నాడు.

ఆ రోజు ప్రొద్దున్నే ఏదోపని మీద శంకరం మేష్టారింటికి బయలుదేరాడు వేణు. అతడు ఆయన యింటికి చేరుకునేప్పటికి లోపల నుండి శంకరంగారు పార్వతి మాట్లాడుకోవడం విన్పించి, లోపలి కెళ్ళడం బాగుండదని, యివతలే నిలబడ్డాడు.

'రఘూకి రాత్రి కంటె యీ పూట జ్వరం ఎక్కువైంది. ఈ పూట ఆస్పత్రికి తీసుకెళ్ళండి...' అని చెబుతోంది పార్వతి.

'ఇప్పుడాస్పత్రికి వెళితే స్కూలు టైముకు రాలేను పార్వతీ...పోనీ యిప్పు డెవరైనా ప్రైవేటు డాక్టరుదగ్గరకి తీసుకెళ్ళు... ఆ జనరల్ ఆసుపత్రిలో నువు తిప్పలు పడలేవు...' అని చెప్పారు శంకరంగారు.

'అయితే ఒక రూపాయివుంటే యివ్వండి. ...ఇంజిక్షను యిప్పించుకునస్తాను... మన పక్కింటి రాధమ్మగారికి తెలిసిన డాక్టరు గారు వున్నారట దగ్గరలోనే....'

'ఇవ్వాళ తారీఖు ఇరవైఎనిమిది... నాదగ్గర వున్నదే యీ ఒక్క రూపాయి. ఇదుగో తీసుకో...సాయిష్ట్రం బాబుకు మందే యిప్పిస్తావో, జీతాలందేదాకా యిల్లే సర్దు

తావో...ఖర్చు కూడా ఆదివారమ్మైంది. జీతా లెప్పటికందుతయ్యో...'

ఈ సంభాషణవిని వేణు నిర్ఘాంత పోయ్యాడు. ఇన్నాళ్ళూ శంకరంగారికి బాగా డబ్బుందని, ఆయన పిసినారికాబట్టే అట్లా వుంటాడనీ, తనలాంటివాళ్ళను బాధపెట్టాలనే వుద్దేశ్యంతోనే యింటికి లైట్లుకూడా పెట్టించలేదనీ అనుకుంటుండేవాడు. మొట్టమొదటిసారిగా వేణుకు మేష్టారి ఆర్థిక స్థితిగతులెటువంటివో తెలిసాయి...పాపం అనుకున్నాడు మనసులో...

'పోనీ రాధమ్మగారిదగ్గర ఓ ఐదురూపాయలు అప్పు తీసుకోమంటారా?...'

'అప్పా?...వద్దు పారూ...అసలే మన రోజులు బాగుల్లేదు...స్కూల్లోనూ అలాగే వుంది...ఇంట్లోనూ అలానే వుంది—దీనికి తోడు అప్పులు తెచ్చిపెట్టకు. అప్పు చెయ్యడమనేది అలవాటయితే అది మానుకోడం చాలా కష్టం. ఒకసారి అప్పుచేస్తే అది అలా రాజుకుంటూనే వుంటుంది, మనల్ని మసిచేసేదాకా. ఇంతదాకా అప్పనేది చెయ్యకపోవడమొక్కటే మన అదృష్టం...పోనీ యీ పూటకు కాస్త కషాయం యిచ్చి చూడరాదూ?...'

వేణుకు ఒకవిధంగా యీయన కష్టాలకు తనే కారణమేమోననిపించింది చప్పున. కమిటీమెంబరు కొడుక్కు లొంగుతాడా లొంగడా అని గురుమూర్తిని వుసికొల్పింది తనే!...వరదరాజులు, మేష్టారిమీద కక్ష గట్టడానికీ తనే కారణమని యీమధ్య తన మిత్రులు వార్త మోసుకొచ్చారు....తను నాటిన యీ విషబీజానికి తనకళ్ళముందు ఆయన ఫలితం అనుభవిస్తుంటే చూస్తూ వూరుకోలేకపోయ్యాడు వేణు. వెంటనే లోపలికొచ్చి...'మేష్టారూ!...బాబుకు మందు నే తెస్తాలెండి...' అన్నాడు...

శంకరంగారూ పార్వతి ఒకరిమొహా లొకరు చూచుకున్నారు.

'ఎందుకులేవయ్యా వేణూ!...ఏమంత జ్వరంలేదు. ఈపూట కాస్త కషాయం యిస్తాను. అదే తగ్గిపోతుంది...తగ్గకపోతే రేపు చూచుకోవచ్చు...' అంది వెంటనే పార్వతి.

'నీ సమయం వృథాచేసుకోకు వేణూ!... నేనే వెళ్ళి త్వరగా మందు పట్టుకొస్తాను.



# “పూర్వాసంధ్యా ప్రవర్తతే...”

సీసా ఏదన్నా యివ్వు పార్వతీ!...’ అన్నారు శంకరంగారు.

‘మీరొద్దు మేషారూ!...అసలే ఆ కమిటీ మెంబరు గురునాథం, వరదరాజులూ మీమీద కక్షగట్టారు...’ అని పోరు జారాక నాలిక్క రుచుకున్నాడు వేణు.

‘వరదరాజులుగారు నామీద కక్ష గట్టారా?’...ఎవరన్నారు ?...’ నిర్ఘాంత పొయ్యారు శంకరంగారు. కమిటీమెంబరు అంటే ఆయన కొడుకుని కాపీకొట్టుకో నివ్వలేదని కోపంవస్తే వచ్చివుండవచ్చు.... కానీ వరదరాజులుగారికి తనుచేసిన అప కారం ఏమిటి?...అని ఆశ్చర్యపోయ్యారు.

జరిగినదంతా ఆయనకు చెప్పడం వేణు కిష్టంలేక, ‘అబ్బే!...ఎవరూ అనలేదండీ... నేనే అనుకున్నాను.’ అని కప్పదాటువేసి, మంచంమీద పడుకోనున్న బాబును ఎత్తుకుని ‘ఆ సీసా యిటివ్వండి...’ అన్నాడు.

*

‘ఎలావుందే ఒంటో ?...’ భార్య మూలుగులు నాకిటిల్లోకే వినిపించేసరికి అక్కడే గుండె జారిన వరదరాజులుగారు మెల్లగా లోపలికి వస్తూనే భార్యను ప్రశ్నించారు.

‘ఎలావుందిట?...ఎలావుంది!...మంచంలో పడుంటే గుక్కెడు మంచినీళ్ళిచ్చే దిక్కు లేకుండా వుద్యోగమంటూ పరుగెత్తి యిప్పుడొచ్చింది ఆపేక్ష!...’ అంది నిష్టూరంగా కమలమ్మగారు.

‘సుబ్బులుగాడ్ని బడికూడా మానేసి నీదగ్గ రుండమంటినే...వాడు కాఫీపెట్టివ్వలా?... అసలు ఏడీవాడు ?... ఎక్కడున్నాడు ?’... అంటూ చుట్టూ చూశారాయన.

‘అదేమంటే యిదీ!...ఆ చిన్న వెధవ ఖాచిపొయ్యాలి నా మొహాన! ఓ డాక్టరూ, మందూ, యింజక్షనూ ఏదీలేదు...ఇంతకూ ఎవర్నమకొని ఏం లాభం?...అంతా నా ప్రారబ్ధం...’ ఆవిడ కంఠం రుద్ధమైంది. మాట పెగల్లేదు. దుఃఖం పొంగి పొర్లి వచ్చింది. ఆవిడకు అసలే కోపం పాలు ఎక్కువ...అందులోనూ ఒంట్లో బాగుండక నీరసంగావున్నప్పుడు యింట్లో వాళ్ల మీద విసుగు, తనమీద, దేముడిమీద అసహ్యం ఎక్కువవుతుంది. నిజానికి కమలమ్మగారికి ఏ రోగమూలేదు ఒక్క నీరసం తప్ప. వెంట వెంట కాన్పులవల్ల నరాల బలహీనత ఏర్పడి అప్పుడప్పుడూ ‘ఫిట్స్’లా వచ్చి మాటామంతీలేకుండా పడిపోతుంది. అలావచ్చాక రెండు మూడురోజులు చాలా నీరసంగా వుంటుంది ఆవిడకు...

‘అయితే డాక్టరుకన్నాడా కబురుపెట్టు లేదన్నమాట...ఒరేయ్ సుబ్బులూ !...వాడు గూడాలేడు గాబోలు...ఒరేయ్ కిష్టిగా!... నువ్వెళ్ళి డాక్టరుగార్ని విజిట్‌కి వెళ్ళేప్పుడు మనింటి కొసారొచ్చి అమ్మను చూసిపొమ్మని చెప్పు....మా నాయనవు కదూ...లే...’ అని బ్రతిమాలారు రెండోకొడుకును...

‘ఫో నాన్నా...ఇప్పుడెవరు పోతారు ?... నేనాడుకోవాలి...’ ఫస్టుఫారం చదువుతున్న కిష్టిగాడు తండ్రి చెప్పింది వినిపించుకో కుండా తన గాలిపటం తీసుకు వెళ్ళిపొయ్యాడు. వాడ్ని మింగెయ్యాలన్నంత కోపంవచ్చింది వరదరాజులుగారికి... కానీ ఏం ప్రయోజనం?...పై కండువా చొక్కాతీసి, వంకెకు తగిలించి, వంటింట్లోకి నడిచారు. కాఫీపెట్టి భార్యకు కాసిని ఇచ్చి, తను కాసిని గొంతులో పోసుకున్నారు. ఏడుపిల్లకు, జ్వరంతగిలిన చంటివాడికీ అన్ని పాలు కలిపి తాగించారు...ఇక డాక్టరు దగ్గరు వెళ్ళడానికని సైకిలుతీస్తే చక్రంలో గాలి లేదు!...ఆయన కోపం తారాపథాని కందుకుంది...

‘ఇప్పుడు స్కూలునుండీ వచ్చేప్పుడు గాలివుంది. ఇంతలోకేమయిందిరా?... ఎవ్వడా వెధవ?...చక్రంలో గాలి తీసినవాడెవడు?... ఏక్కి దవడలు వాయించేస్తాను?...’ అంటూ శివమెత్తినట్లు కోపంతో వూగిపోతూ వెతుకుతున్నారు.

‘నాన్నా...మరే...మన నర్సిగాడు...తమాషా చేస్తానంటూ...ఆగొట్టంమూత...తీసేశాడు. భలే...తుస్సంటూ...’ ఏడేళ్ళపిల్ల రాధ అభినయంచేసి చూపిస్తూ వర్ణిస్తోంది.

‘ఏడిరా?...నర్సిగా!...నర్సిగా!...’ వరదరాజులుగారు మంచంచాటున నక్కినవాడ్ని చెవుపట్టుకు బయటకు లాక్కొచ్చారు... ఆయన కొట్టడానికి చెయ్యెత్తడమే తరు

# "హాకాళ్యాసంధ్యా ప్రవర్తతే.."

హాయి, 'అమ్మా!...' అంటూ రాగం ఎత్తుకున్నాడు.

'అయ్యో!... ఏమరుపులండీ!... సన్నపిల్లు బతకనిస్తారా? చావమంటారా?...డాక్టరు దగ్గరకు వెళ్ళడానికి మీకంత కష్టంగా వుంటే మానెయ్యండి నాచావు నేచస్తాను... ఆపిల్లల్ని కొట్టిచంపితే ఏమొస్తుంది?...' ఆ నీరసంమీద మాటకూడా ధాటీగా మాట్లాడలేక గొంతు కీచుబోయింది. కమలమ్మగారి 'వీటో'తో గప్‌చుప్‌గా వాడిచెవిని వదిలేసి సైకిలుపంపు వెతకనారంభించారు వరదరాజులుగారు...కానీ అదికూడా కుమారరత్నం ఎక్కడ పడేశాడో కన్పించక, కిమ్మనకుండా కాళ్ళకు బుద్ధిచెప్పారాయన. .

అలా నడుస్తుంటే అనేక ఆలోచనలు గిర్రున తిరుగుతున్నయి ఆయన మనసులో. 'ఈనెల ట్యూషన్సుకూడా ఎక్కువ లేవు... ఈ ఖర్చు ఎలా భరించడం?.. అనే సమస్య ఆయన్ను వేధిస్తోంది...ఏంజబ్బో...డాక్టర్లకు పొయ్యిలేక చస్తున్నాను...' అనుకున్నారాయన...ఆవిడజబ్బు తల్చుకున్నప్పుడల్లా, కమలమ్మగారికి ఐదోకాన్పు అప్పుడు డాక్టరుగారు యిచ్చిన సలహా వద్దన్నా జ్ఞాపకం వస్తుందాయనకు...

ఆరోజు ఆయన చిలక్కు చెప్పినట్లు చెప్పారు—'ఇప్పటికే ఆవిడ చాలా నీరసంగా వుంది...ఇకముందు మళ్ళీ గర్భవతయితే మరీ నీరసిస్తుంది...బిడ్డలూ నీరసంగా వుంటారు. ఆవిడను ఆపరేషను చేయించుకోమంటే భయపడుతున్నారు...మీరైనా యిక ముందు సంతానం కలుగకుండా ఏదైనా మార్గం చూసుకుంటే మంచిది', అని సలహా యిచ్చారు.

వరదరాజులుగారికి ఆమాటలు తలకెక్కలేదు. పైగా, 'అలాంటి పాపపు పనులు మేము చెయ్యం...' అని ఖచ్చితంగా చెప్పేశారు. .నిజానికి పాపపుణ్యాలకంటె ఆయనకు ఆపరేషను అంటే భయంవేసింది ముఖ్యంగా ...ఆమాటంటే డాక్టరు చీవాట్లు పెడతాడేమోనని దానికి పాపమనే రంగుపూసి తప్పించుకోజూచారు.

అప్పటికీ డాక్టరు ఎంతగానో నచ్చచెప్పారు...

'రైతు ఒత్తుగా విత్తనాలు జల్లితే ఏమవుతుంది చెప్పండి?... మొక్కలు ఏపుగా ఎదగవు...నారుతీసి మళ్ళీ 'కొంతదూరముండేలా నాటితే తప్ప అవి మంచి పంటనివ్వవు. బిడ్డకూ బిడ్డకూ కనీసం మూడు సంవత్సరాల తేడా లేకపోతే తల్లి ఆరోగ్యంగానూ, బిడ్డ పుష్టిగానూ వుండరు. పైగా తల్లికి బిడ్డకూ పుష్టికరమైన ఆహారం యివ్వకపోతుండిరి...బిడ్డలు భగవత్ప్రసాదమని భావించినప్పుడు వాళ్ళను అపురూపంగా పెంచుకోవాలి. వాళ్ళకు చక్కటి భవిష్యత్తు నిర్మించడానికి అవకాశాలు కల్పించాలి. వాళ్ళను విసుక్కుంటూ, తిట్టుకుంటూ; కడుపునిండా తిండిపెట్టలేక; ఒంటినిండా గుడ్డ యివ్వలేక, జీవితవరాలగా భావించాల్సిన పిల్లలను, శాపాలుగా భావిస్తూ భరించేకంటే, పరిమితమైన సంతానంతో మీ బ్రతుకులూ, వాళ్ళ బ్రతుకులూ సుఖప్రదం చేసుకోడం మంచిది...' అని ఓ గంటసేపు బోధించారాయన.

అయితే యివన్నీ వరదరాజులుగారికి తెలియవనుకోడం ఆయన పొరబాటు. వచ్చిన చిక్కల్లా, తమ ఆలోచనల్ని ఆచరణలో పెట్టలేకపోవడం ఆయన బలహీనతల్లో ఒకటి...టీకాలు వేయించుకుంటే మశూచికం రాదని, వచ్చినా అంత ప్రమాదం వుండదనీ, అందరికీ తెలుసు. కానీ టీకాలు వేసేవాళ్ళు కన్పించగానే పొలాల్లోంచి పారిపొయ్యేవాళ్ళు యిప్పటికీ ఎంతమంది లేరు!... ఇదీ అంతే .

వరదరాజులుగారు డిస్పెన్సరీకి వెళ్ళేసరికి రోగులు చాలామంది వున్నారు. 'ఈరోజుల్లో మనుషులు ఆహారంతిని కాదు మందులుతిని జీవిస్తున్నారు' అనుకున్నారాయన. డాక్టరుగారు వచ్చేదాకా వుండి ఆయన్ను వెంటబెట్టుకు తీసుకొచ్చి, భార్యకు యింజక్షను యిచ్చి ఆయన వెళ్ళాక ఆదరాబాదరాగా వంటయింట్లోకి ప్రవేశించారు వరదరాజులుగారు. అన్ని చికాకులూ కలిపి వంటపాత్రం పైన చూపిస్తూ, పోరు వెళ్ళగక్కలేని కోపాన్ని చేతులద్వారా చూపిస్తూ అత్తెసరు పడేశారు. ఏడాది మొదట్లోనే చేరిన నలుగురు కుర్రాళ్ళకూ వాలుగు లెక్కలిచ్చి చేస్తుండమని చెప్పి కూరముక్కలు తరుగదానికి వెళ్ళారాయన...ఒకపక్క పెద్దబిడ్డ ఆకలంటూ ఏడుపు లంకించుకొంది. కూతురు రాధను బ్రతిమాలుకుని మరో కుంపట్లో బొగ్గులు పోయించి కూరముక్కలు పోపులో పడేస్తుండగా ట్యూషను కుర్రాడువచ్చి, 'మేషారూ! శంకరం మేషారు వచ్చారండీ మీకోసం...' అని చెప్పాడు.

'వస్తున్నానని చెప్పు...' అని చెప్పంపి, ఎందుకువచ్చాడబ్బా అని ఆలోచిస్తున్న వరదరాజులుకు మెరుపులా ఓ ఆలోచన తట్టింది. 'రాకెక్కడికి పోతాడు?...కుర్రాళ్ళను ఆకట్టుకొని గోల చేయించడంకాదు, ఇతడితల్లో జేజెమ్మలు గూడా దిగొచ్చి కాళ్ళుపట్టుకొనేలా చేయించడం నాకూ



తెలుసు...' అనుకున్నారు గర్వంగా...

వరదరాజులుగారు అన్నండించి, కూర కలియబెట్టి, 'ఎడపిల్ల కంచంలో అన్నం పడేసి బయటకొచ్చారు....ఆయన వచ్చేదాకా బయటే నిలబడి వున్నారు శంకరంగారు...

'ఏమయ్యా శంకరం?....నెమ్మదిగా జ్ఞాపకం వచ్చామే!...!'

'మీతో చిన్న పనుండి వచ్చాను...' అన్నారు శంకరంగారు.

'అదే...అదే...పనిలేకుండా మాయిల్లు వెతుక్కుంటూ వస్తావనుకుంటావా?...' అంటూ ఎత్తిపొడిచారు.

'మీ పెద్దబ్బాయి సుబ్బారావు విషయం కాస్త మాట్లాడుదామని వచ్చాను.'

'మా పెద్దబ్బాయి సంగతా!... ఏమిటది?...'

మీ సుబ్బారావు అక్కడెక్కడో కిళ్ళీ కొట్లో కూర్చుని ప్రొద్దునా సాయంత్రమూ డిటెక్టివ్ నవలలు చదువుతూ, చెడుసావాసా వల్ల, దురలవాటు...'

ఇంకా శంకరంగారి మాట పూర్తికాక ముందే, 'ఎవరు చెప్పారు?...' అని గద్దించి అడిగారు వరదరాజులుగారు.

'నాకు తెలిసింది. మీకు చెప్పకుండా వుండడానికి మనసొప్పలేదు...మీతో చెబితే లబ్బాయిని తగు జాగ్రత్తలో పెట్టుకుంటారని వచ్చాను...' శంకరంగారు యింకా ఆయనకు తెల్సిన విషయాలన్నీ చెప్పలేదు వరదరాజులుగారు బాధపడతారనే వుద్దేశంతో...

వరదరాజులుగారి మొఖం కోపంతో జేవురించింది. ఆయనకు కొడుకు చెడిపోతున్నాడన్న సంగతి తెలిసినా, ఆయన దానికి బాధపడుతున్నా, అది శంకరంగారి నోటంట విని సహించలేకపొయ్యారు. 'మావాడిమీద ఫిర్యాదులు చేసేముందు, నీదగ్గర చదువుకునే పిల్లల్ని తగుజాగ్రత్తలో పెట్టుకో... నా కొడుకు బాగోగులు నాకు తెలుసు. ఎవ్వరూ కష్టపడి చెప్పక్కరలేదు...వస్తాను ...నాకు పనుంది...' అంటూ గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళిపొయ్యారు వరదరాజులుగారు.

తోటిఉద్యోగి, కొడుకు పాడవుతున్నాడు. చెబితే కాస్త మంచిమార్గంలో పెట్టుకుంటాడనే వుద్దేశంతో తనువస్తే యీయనకెందుకింత కోపం వచ్చింది!...ఆరోజు వేణు అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి శంకరంగారికి...'అతడన్నది - నిజమే అయ్యుంటుందా?' అనుకుంటూ యింటిముఖం పట్టారు శంకరంగారు.

* * *

ఏమండీ!...సుశీలకు తల్లి లేదా?...'

'ఏం ఎందుకు వచ్చిందబ్బా ఆ సందేహం!' 'కురుక్షేత్ర' మేగజైను చదువుకుంటున్న ఆనందరావు పుస్తకం మూసేసి ప్రశ్నించాడు. వచ్చిన యిన్నాళ్ళకుగాను జ్యోతికి యిరుగుపొరుగును గురించి తెల్సుకోవాలనిపించినందుకు ఆశ్చర్యపోతూ...

'ఏంలేదు, సుశీల 'పిన్ని'...అంటుంటేను...'

'అబ్బే!...తల్లీ తండ్రీ వున్నారు కానీ యీ అమ్మాయిని వాళ్ళ పిన్ని పెంచుకుంటోంది....'

'హమ్మయ్య!...పోన్లే. సవతి తల్లేమోనని భయపడ్డాను.' అప్పటికి భయంతీరింది జ్యోతికి.

'ఏం హమ్మయ్య అంటున్నావ్...ఏం జరిగిందేమిటి?...' ఆనందరావు గుచ్చి గుచ్చి అడిగాడు.

'ఏంలేదు. మొన్నోరోజు గుండ్రటి మొహానికి బాగుంటుందని రెండుజడలు వేశాను. 'మా పిన్ని కోప్పడుతుంద'ని భయపడుతూ వెళ్ళిందొమ్మాయి...అప్పటినుండీ మనింటివైపుకే రావటంలేదు. ఆవిడేమన్నా అన్నారేమోనని భయంగా వుంది.'

'ఎప్పుడో తప్ప ఆవిడ కోప్పడదు కానీ... సుశీలకే మహా అభిమానం...ఆవిడేమన్నా అంటుందేమోనని భయపడుతుంది. ఇక రావటం లేదంటే...నువ్వెప్పుడైనా వాళ్ళింటికి వెళ్తేగా వాళ్ళు మనింటికి వచ్చేది!... నిన్ను నీవు వెలేసుకున్నట్లు కూర్చుంటే వాళ్ళకేం పట్టింది నీచుట్టు తిరగడానికి?...'

'ఏమోనండీ.. వాళ్ళు అదోలా మాట్లాడుతారు. అలా మాట్లాడితే నాకు చాలా కష్టం వేస్తుంది.' అన్నది జ్యోతి తల వంచుకుని.

'వాళ్ళంటే తెలియనివాళ్ళు జ్యోతీ!... తెలిసినదానివి, చదువుకున్నదానివి నీవు చేస్తున్న ఘనకార్యం ఏమిటి చెప్పు... వాళ్ళతో కలిసి తిరిగితే వాళ్ళ బాగోగులు తెలుస్తాయి...చేతైతే వాళ్ళను సరిదిద్దవచ్చు. ఇలా వాళ్ళనుండి దూరంగా వున్నందున వాళ్ళకు నీమీదున్న దురభిప్రాయాలు బలపడుతున్నాయి గానీ ఏమన్నా తొలగించగలిగేవా చెప్పు?...' అన్నాడు.

ఆలోచిస్తే ఆయన మాటల్లో కొంత నిజం లేకపోలేదు అనిపించింది జ్యోతికి. పరిసరాలకు, పరిస్థితులకు అనుగుణంగా వ్యవహరించడం, పరిస్థితుల కనుగుణంగా తన్ను తాను మలుచుకోడం నేర్పని చదువు వ్యర్థమేమో!...మనిషి సంఘజీవి. ఎవ్వరికీ సరిపడకుండా, ఎవ్వరి స్నేహమూ అభిలషించకుండా గడపడమనేది మనిషికి సాధ్యపడని విషయం...అలాగని వేరువేరు దృక్పథాలు, వేరువేరు భావాలు, జీవన విధానాలు గలవారితో స్నేహం నెరపడం కూడా కష్టసాధ్యమైన విషయమే!...ముఖ్యంగా తమ మీద కొన్ని దురభిప్రాయాలు ఏర్పరచుకొన్న వారితో స్నేహం చెయ్యడం కూడా చాలా కష్టమే!...అయినా తనుమాత్రం ప్రయత్నించడంలో తప్పేముంది!...అనుకున్న జ్యోతి ఆసాయంత్రం నర్సమ్మగారిని తోడు తీసుకుని సుశీలా వాళ్ళింటికెళ్ళింది.

సుశీలా వాళ్ళిల్లు ఆనందరావు యింటి పక్కనే. ఇంటికి కాంపౌండ్ వాల్ ఏమీ లేదు. ఇల్లు దేశవాళీ పెంకుటిది. ఆనందరావు వాళ్ళ ప్రహరీనానుకొని గొడ్లపాక. వాకిటిముందు గడ్డివాము. మట్టినేల శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టివుంది... ఇల్లూ, వాకిలీ, పరిసరాలు చాలా శుభ్రంగా వున్నయి.

జ్యోతిని చూడగానే, 'పిన్నీ!...పిన్నీ!... వదినమ్మ వచ్చింది పిన్నీ!...' అంటూ దొడ్లోకి పరుగెత్తింది సుశీల, కనీసం వాళ్ళను లోపలికి రమ్మనైనా చెప్పకుండా!... సుశీల పిన్ని దుర్గమ్మగారు సంభ్రమాశ్చర్యంతో, 'రామ్మా...రా...' అంటూ వచ్చింది. ఎన్నడూ ఎవ్వరింటికీ వెళ్ళని జ్యోతి, యివ్వాళ పిలవకుండా తమయింటికి రావడం ఆవిడకు ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ కూడా వుంది. చాపవేసి 'కూర్చో' మంది. ఆవిడకు జ్యోతితో ఏం మాటా

# పూర్వా సంధ్యా ప్రవర్తతే..

డాలో తోచలేదు. మాట్లాడకుండా ఎదురుగ్గా కూచుంది.

'ఏదండీ మా మరదలు పిల్ల ?...ఇలా కనబడి అలా మాయమైంది ?...' అంటూ తనే చలికరించింది జ్యోతి.

'సుశీలా !...దొడ్లో వున్నట్టుంది... అమ్మాయి...సుశీలా !... మీ వదినమ్మ నీ కోసం వస్తే దొడ్లో కూచున్నావేం ?... రారా...' అని కేకేసింది దుర్గమ్మగారు.

సుశీల సిగ్గుపడుతూ వచ్చి నిలచింది.

'ఏం సుశీలా!...మా యింటికి రావడమే మానేశావ్ ?...' అని జ్యోతి అడిగినదానికి దుర్గమ్మగారు కల్పించుకుని, 'అది యిది వరకు ఎప్పుడూ అక్కడే తిరుగుతుండేది 'అన్నయ్యా, అన్నయ్యా' అంటూ. ఇప్పుడు నేనే వద్దన్నాను. దానికేమీ తెలియదు, అవాకులూ చవాకులూ వాగుతుందేమోనని' అని అన్నది.

'అయ్యో పసిపిల్ల తన కేమిటండీ...ఈ రెండు రోజుల్నుండి సుశీల రాకపోతే నాకేమీ తోచటంలేదు....' అంది జ్యోతి.

ఆ తర్వాత దుర్గమ్మగారు జ్యోతి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు వగైరా వివరాలన్నీ అడిగి తెలుసుకుంది. అన్నిటికీ ఓపిగ్గా జవాబులు చెప్పింది జ్యోతి.

'ఇంతకూ మా అబ్బాయి కంటె నువ్వెక్కువ చదువుకున్నావుటగా ?...' అని అడిగింది ముక్కుమీద వేలు వేసుకుని.

జ్యోతి యిరకాటంలో పడిపోయింది. ఏమని జవాబివ్వాలో తోచలేదు. అయినా జవాబు చెప్పకపోతే ఏమనుకుంటుందోనని, 'మా నాన్నగారికి చదివించటం యిష్టం. అందుకని నన్ను చదివించారు.' అని చెప్పింది.

'అయినా - అమ్మాయి ! నాకు తెలీక అడుగుతానుగానీ....ఆడవాళ్ళకు చదువెందుకమ్మా!?...ఉద్యోగాలు చేస్తారా ? ఊళ్ళేలుతారా ?...ఇంత వంటా వార్పు నేర్చుకుంటే సరిపోయేదానికి...' అని దుర్గమ్మగారు అనేసరికి జ్యోతికి కష్టమని పించింది! వీళ్ళెందుకిలా మొఖాన అనేస్తారు ?...అవతల వాళ్ళు నొచ్చుకుంటారనేది తెలీయదా ?....లేక నొప్పించటం గొప్పనుకుంటారా ?...అని ఆలోచిస్తూ కూర్చుంది.

కాసేపు కూచుని వచ్చేస్తూ 'వస్తాను పిన్నిగారూ ! మీ రెప్పుడైనా ఓ మాటు మా యింటికి రండి...సుశీలను పంపిస్తుంటారు గదూ !' అని చెప్పి వచ్చేసింది.

జ్యోతి వరుస పెట్టి 'పిన్నిగారూ !' అని పిల్చేసరికి దుర్గమ్మగారి మొఖం చాటంతయింది. 'అట్టాగేనమ్మా....తప్పక వస్తా నంటూ' వాకిటిదాకా వచ్చి సాగనంపింది.

మరునాడు మధ్యాహ్నం సుశీల వచ్చింది అడుగులో అడుగేసుకుంటూ. జ్యోతి పూరీలు చేస్తోంది వంటింట్లో. ఆనందరావు యింట్లో వున్నరోజున మధ్యాహ్నం టిఫిను




చేసేది జ్యోతి. ఆ రోజు అతడి కిష్టమని పూరీలు, వెజిటబుల్ కుర్మా చేస్తున్నది.

'ఇక్కడున్నావా వదినమ్మా ?...అదేమిటి నువు చేస్తున్నావ్ !!...' అన్నది వింతగా చూస్తూ.

'ఏం నేను చెయ్యకూడదా ?...' .జ్యోతి ఎదురు ప్రశ్న వేసింది.

'అహా....అది కాదు....నీకు వంట చెయ్యటం రాదన్నారుగా !!!........'

'అని ఎవరన్నారు ?...'

సుశీల చెప్పడం యిష్టంలేక నీళ్ళు నమిలింది. జవాబు చెప్పకుండా పక్కనే వచ్చి కూర్చుంది కుంపటి విసురుతూ...జ్యోతి పళ్ళెంలో పూరీలు కూరా పెట్టి, 'నదినమ్మకు వంట వచ్చో రాదో నువు చెప్పాలి...' అంటూ సుశీల ముందు పెట్టింది.

'వద్దు వదినమ్మా.'

'ఇదో అమ్మాయి ఇలా మాటిమాటికీ బెట్టుచేస్తే నేను నీజట్టుండను తెలిసిందా ?...' చిన్నపిల్లలా బుంగమూతి పెట్టి అంటున్న జ్యోతిని చూస్తుంటే భయమంతాపోయి చనువేర్పడింది. నవ్వుతూ పళ్ళెం ముందుకున్న సుశీల 'వదినమ్మా...ఈ కూర కూడా నువ్వే చేశావా ?...అని' అడిగింది.

'ఏం బాగుందా?...'

'భలే బావుంది వదినమ్మా...నిజంగా నువ్వే చేశావా?!'

జ్యోతి నవ్వింది. ఈ ఊళ్ళో వాళ్ళందరికీ తనమీద యిలాంటి అభిప్రాయాలున్నాయన్నమాట !...అనుకుంది.

'సరేగానీ సుశీలా రమణయ్యగారింట్లో శ్రావణ మంగళవారం నోములని పేరంటం పిలిచారు. నువ్వుకూడా వస్తావా నాతో?'

'నువ్వు పేరంటానికి వస్తావా !!... నిజంగానా !—తమాషా కంటున్నావా వదినమ్మా ?'

'బాగుందమ్మా...నీ అనుమానాలు నేను తీర్చలేను. ఇంతకూ నువ్వు వస్తావో రావో చెప్పు...'

'అయితే నువు తయారయి వుండు వదినమ్మా...నేను నిమిషంలో బట్టలు వేసుకు వస్తాను.' అని చెప్పి ఒక్క పరుగు తీసింది సుశీల.

[ఇంకా వుంది]

## పెద్దలకు పిన్నలు సుద్దులు





# ధర్మపథం

బులుసు వెంకటరమణయ్య

అనుభవజ్ఞులైన పెద్దలు పిన్నలకు మంచి బుద్ధులు నేర్పడం సహజం. అయినా కొన్ని సందర్భాల్లో పిన్నలే పెద్దవాళ్లకు బుద్ధి చెప్పవలసి వస్తుంది. పెద్దలు అధర్మంగా ప్రవర్తించినప్పుడు బుద్ధిమంతులైన చిన్నవాళ్లు హితాన్ని బోధించడం కద్దు. ఇట్టి సంఘటనలు ఉపనిషత్తుల కాలంలోనూ కానవస్తాయి. వాటిలో నచికేతుని వృత్తాంతం పేరు పడింది.

వాజశ్రవసుడనే మహాముని ఒకప్పుడు విశ్వజిద్యాగం చేశాడు. ఆ యాగం చేసేవారు తమవద్ద వుండే వస్తువులలో ఒకటినీ మిగిల్చకుండా దానం చెయ్యవలసి ఉన్నది.

ఆ మహాయాగం చెయ్యడానికి అతని దగ్గర ఏముందీ? అందువలన అతడు అందరినీ యాచించి గోవులనూ, ఇతర వస్తువులను కూడబెట్టి యాగం ప్రారంభించాడు. ప్రారంభించాడు గాని, అతని మనస్సు పరిపక్వం కాలేదు. ఆ గోవులనూ వాటినీ చూస్తే ఆ మునికి కళ్లు కుట్టాయి. మేలైన గోవులను దానం చెయ్యకుండా దాచివేసి, ఉపయోగంలేని వాటినే—అంటే కళ్లు లేనివీ, నీరు తాగలేనివీ, గడ్డి కొరకలేనివీ, వట్టి పోయినవీ అయిన వాటినే దానం చెయ్యసాగాడు.

మునిపుత్రుడు నచికేతుడు ఉత్తమ స్వభావం కలవాడు. తండ్రి చేస్తున్నపని అతడు గమనించి చాలా విచారించాడు. 'ఇట్టి అకృత్యం వల్ల యాగంవల్ల ఫలం లేకపోగా నాన్నగారికి నరకం కూడా సంభవిస్తుంది. ఈ లోభత్వానికి కారణం నేనేగదా. నా కోసమే కదా యీ దాపరికం! నన్ను కూడా ఎవరికైనా దానం చేస్తే, యిలా దాచనక్కర్లేదుగదా! ఈ విషయమే అడుగుతాను' అని నచికేతుడు తండ్రితో 'నాయనగారూ! మీరు సర్వమూ త్యాగం చేయవలసిన విశ్వజిద్యాగాన్ని జరుపుతున్నారు. సమస్త వస్తువులనూ, మీకు స్వాధీనంలో ఉన్న గోవులనూ దానం చేస్తున్నారు. నేను మీ కుమారుడను. నన్ను కూడా దానం చెయ్యవలసి వున్నది కదా! నన్ను ఎవరికి దానం చేస్తారో చెప్తే, వారి వద్దకు వెళ్లి సేవలు చేస్తూ ఉంటాను' అని అన్నాడు.

వాజశ్రవసుడు మొదట్లో యీ మాటలను లక్ష్యపెట్టలేదు. నచికేతుడు ఊరుకోకుండా నొక్కి నొక్కి ముమ్మారు అడిగేసరికి అతనికి కోపం వచ్చింది. ఎవనికోసం తాపత్రయపడి తాను మంచి పదార్థాలను జాగ్రత పెడుతున్నాడో—ఆ పుత్రుడే యీ రీతిని తన్ను ఎదిరించి అడగడం వల్ల ఆ మునికి కొడుకుపై అసహ్యం కలిగింది. అతడు పట్టరాని కోపంతో ముందు వెనుకలు ఆలోచించకుండా 'నిన్ను మృత్యుదేవతకు ఇస్తాను' అని అనివేశాడు.

తండ్రి పలికినమాట విని కుమారుడు ఆశ్చర్యపడ్డాడు. దానం వల్ల ప్రతిగ్రహీతకు ఏదైనా ప్రయోజనం ఉండాలి. మృత్యుదేవత అయిన యమునికి తనవల్ల ఏమీ ఉపయోగమో అతనికి బోధపడలేదు. మళ్లీ ఆలోచించాడు. తండ్రికి, తాను మరణించడం యిష్టం లేదనీ, కోపం కొద్దీ ఆ విధంగా అన్నాడనీ గ్రహించాడు. అయినా, ఆడినమాట తప్పితే దానివల్లనూ నరకమే ప్రాప్తిస్తుంది. అసత్య దోషం తండ్రిని అంటకూడదు. అందువల్ల నచికేతుడు మరల ఇలా అన్నాడు—

'తండ్రీ! మీరు నన్ను మృత్యుదేవతకి ఇవ్వాలని నిశ్చయించారుగదా! అలాగే జరిపి తీరాలి. మన వంశంలో యింతవరకూ ఎవ్వరూ ఆడినమాట తప్పలేదు. మీరూ ఆ రీతినే నడుచుకోవాలి. లేకపోతే అసత్య దోషం వస్తుంది. నేను మరణిస్తే మీరు విచారించకూడదు. చావు పుట్టుకలు మనుష్యునికి సహజాలు, సస్యం పుట్టి, పెరిగి, ఎండిపోయి, మళ్లీ బీజ మూలంగా పుట్టినట్లే మనుష్యులున్నూ పుట్టుతూ, మరణిస్తూ వుంటారు.'

కుమారుని మాటలకు తండ్రి బదులు చెప్పలేక పోయాడు. నచికేతుడు మరణించడానికి అతడు అనుమతించక తప్పిందికాదు.

మరణించిన నచికేతుడు యముని గృహం చేరుకున్నాడు. సంయమనీ పురంలో. అప్పుడు యమధర్మరాజు గృహంలోలేడు. ఎక్కడికో వెళ్లి వున్నాడు. మూడు దినాల వరకూ యింటికి రాలేదు. నచికేతుడు యముని భవనద్వారం దగ్గర అరుగుమీద కూర్చుని మూడు దినాలూ గడిపాడు. ఇంటికి వచ్చిన ఆ అతిథికి ఆతిథ్యం ఇవ్వడం యింటిలోని వారికి సాధ్యపడలేదు. గృహ యజమాని అనుమతి లేకుండా ఇంటిలోనివారు ఎవ్వరికీ ఆతిథ్యం యివ్వకూడదు. ఆ అధికారం వారికి లేదు.

మూడురోజులయాక యముడు వచ్చాడు. ఇంటికి వచ్చిన అతిథి మూడు దినాలు తిండి లేక పస్తుండడం వల్ల గొప్ప పాపం మెడకు చుట్టుకుంటుందని అతడు భయపడ్డాడు. ఆ పాతకం పోట్టుకొనుటకు గాను యముడు నచికేతుడికి మూడు వరాలిస్తూ, ఏమి కావాలో కోరుకోమన్నాడు. తన యెడల అనుగ్రహం చూపిన ఆ ధర్మప్రభువుకు పదే పదే నమస్కారాలు చేస్తూ నచికేతుడు కృతజ్ఞత చూపి, తాను తిరిగి బ్రతికేటట్లు, తన్ను చూచి, తన తండ్రి కోపించకుండా సంతోషించేటట్లు, కోరుతూ మూడవ వరంగా ఆత్మ స్వరూపాన్ని వివరించాలని ప్రార్థించాడు. యముడు తక్కిన వరాలను సులభంగా ఇచ్చినా, ఆత్మస్వరూపం వివరించడానికి మాత్రం మొదట్లో సమ్మతించలేదు. నచికేతుడు ఎక్కువ ప్రాధేయపడగా—ఆత్మ స్వరూపాన్ని వివరించి, నచికేతుణ్ణి తిరిగి భూలోకానికి పంపివేశాడు. ●

# ఫ్లారెన్సు నైటింగేల్

[1820 లో విలియమ్ నైటింగేల్, ఆతని భార్య ఫాన్నీ ఇటలీ పర్యటించడానికి వెళ్ళారు. వాళ్ళు బాగావున్నవాళ్ళు, మహా రాజభోగం అనుభవిస్తున్నవాళ్ళూను. ఇటలీ దేశంలో సుందరనగరం ఫ్లారెన్స్. వారక్కడ వుంటుండగా ఒక అమ్మాయి జన్మించింది.]

'ఆడుకోడానికి గార్డెన్లున్నాయి, ఆట స్థలాలున్నాయి. గుర్రాలమీద స్వారీ చేస్తున్నాను. కుక్కపిల్లలతోటి, పిల్లిపిల్లలతోటి సరదాగా కాలక్షేపం చేస్తున్నాను. చిన్నపిల్లలు కోరుకునేవన్నీ నాకున్నాయి. తోటివాళ్ళకంటె, ఎక్కువ ఆనందాన్నిచ్చే భాగ్యం నాకున్నది. అయినా ఆ ఆనందానికి నోచుకోలేకపోతున్నాను. నాకీవిధమైన జీవితం మీదే విరక్తిపుడుతోంది. సంఘానికి సేవ చేస్తూ పదుగురికి నా సహాయాన్ని పంచి పెట్టగల కార్యాన్ని నిర్వహించాలనిపిస్తూవుంది.'

—ఫ్లారెన్స్

(16వ ఏట తన డయిరీలో)

'1837 ఫిబ్రవరి ఏడవతేదీన దేవుడు నాతో మాట్లాడాడు. తనను సేవించడానికి నన్ను పిలిచాడు.'

—ఫ్లారెన్స్

(16వ ఏట ఆమె 'ప్రయివేట్ నోట్స్'లో)

[దేవుడు ఫ్లారెన్స్‌తో మాట్లాడినప్పటి నుంచి తను దేవుడికి ఎటువంటి సేవ చేయాలా అనేదానిగురించి నిర్విరామంగా ఆలోచించసాగింది. మొట్టమొదట పేదలను కరుణించడంలో మునిగిపోయింది. ఈపని ఆమె తలిదండ్రులకు ఇష్టంలేదు. ఒక గొప్పవంశంలో జన్మించిన స్త్రీ ఇలా 'పాడయిపోతున్నందుకు' వారు ఎంతో విచారించారు! వెంటనే ఆమెను లండన్ పంపించేశారు. అక్కడ ఆమెను రిచార్డ్ మైల్స్ వివాహం చేసుకోవాలనుకుని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. రాజకీయ వేత్త లార్డుహవ్‌టన్‌గా ప్రసిద్ధిగాంచినవాడు ఆతనే.]

'రిచార్డ్ మైల్స్! మనిద్దరిజంట బాగుంటుందని నా తలిదండ్రులు కూడా అనుకుంటున్నారు. వివాహ జీవితంకంటె మహోత్కృష్టమైన, సంతోషమైన జీవితం వేరే మరోటివుందని నా కనిపిస్తూవుంది. వివాహబంధనికి కట్టుబడిపోతే నేను దేవుడికి ఏవిధంగా సేవచేయగల్గుతాను?'

—ఫ్లారెన్స్

[నిరుపేదలకి సేవచేయడంలో లీనమైపోయింది ఫ్లారెన్స్. ఆమె సేవాలక్ష్యాన్ని నెరవేర్చడానికి సర్వకాల సర్వావస్థల్లోను కృషి చేయసాగింది. ఈ పవిత్రకార్యాన్ని గురించి ఆలోచించేకొద్దీ, సేవచేసేకొద్దీ ఆమె అసంతృప్తి ఎక్కువ అవజొచ్చింది. ఎంతచేసినా ఇంకా చాలావుంది అనిపించేది. ఆమె అసంతృప్తిని గమనించిన తల్లిదండ్రులు ఆమెకు వివాహంచేయ విశ్వ యించుకున్నారు.]

'మనం నిర్వహించబోయే కార్యక్రమా లన్నిటికీ దేవుని ప్రేమించడంద్వారా పునాది లభిస్తుంది. అలెగ్జాండ్రియాలో ఒకసంస్థను దర్శించినప్పుడు నాకీ సత్యం తెలిసింది. అక్కడున్న పందొమ్మిదిమంది 'సిస్టర్లు' తొంభయిమందిచేసే పనిచేస్తున్నారు. ఆ సంస్థ ఒక పాఠశాలను, అనాథ శరణాలయాన్ని నిర్వహిస్తూవుంది. వాళ్ల కాలి గోటికి కూడా నేను సరితూగను. వాళ్ళు చేసే సేవలో నేనెంత?'

—ఫ్లారెన్స్

(63 వ పేజీ చూడండి)

## డాక్టర్ కబుర్లు

### చర్మంమీద మందుల ప్రభావం

కొందరి చర్మాలు ఆవుషధాలవల్ల మారిపోతూఉంటాయి! అంటే, లోపలికి పుచ్చుకునే మందులు వారి చర్మాలలో మార్పులు తెప్పిస్తాయన్నమాట. సాధారణంగా చర్మం కాంతి ప్రభావానికి లోనవుతుంది. సూర్యరశ్మి కొంతసేపు తగిలినా మారుతూ ఉంటుంది.

కొన్నిప్పుడు చర్మం నల్లబడవచ్చు. మరికొన్ని సమయాలలో దేహంమీద చిన్న చిన్న కురుపులు రావచ్చు. దురదలు పుట్టవచ్చు.

సాధారణంగా ఈ రకం బాధలు తెప్పించే మందులు—

1. ఏంటిబయోటిక్స్— కొన్ని ఏంటిబయోటిక్స్, సల్ఫామందులు వేసుకున్నప్పుడు ఎండలో తిరగకపోవటం మంచిది.

2. సెడేటివ్‌లు—మత్తు కలిగించే మందులు. అందులో బార్బిట్యురేట్‌లు.

3. ఫంజిసయిడ్‌లు—'ఫంగస్' బాధ లని వదిలించటానికి వాడేమందులు.

4. డయు [illegible] దేహంలో [illegible] చేరినప్పుడు [illegible] నానికి



వాడేమం [illegible]. [illegible], [illegible] వాపులకి కూడా ఇస్తూఉంటా [illegible]

హెచ్. ఎల్. హెర్సెన్‌సోన్

(కాపీరైటు.)

## రాష్ట్రపతి భవనంలో ప్రత్యేకోద్యోగం

17 సంవత్సరాల నిలోఫర్ ఖుర్షీద్ త్వరలోనే అందరికీ సుపరిచితురాలు కాగలదు. డా. జకీర్ హుస్సేయిన్ సతీమణి ప్రాంఘిక సమావేశాలవంటి కార్యక్రమాలలో పాల్గొనటానికి ఇష్టపడటంలేదు కాబట్టి వారిబదులు రాష్ట్రపతితోబాటు ఆయన



కుమారి నిలోఫర్ ఖుర్షీద

మనవరాలు నిలోఫర్ ఖుర్షీద్ వాటిలో పాల్గొంటుంది.

నిలోఫర్ ఇటీవలే స్కూలు చదువు ముగించి ఢిల్లీలోని పాలిటెక్నిక్‌లో చేరింది. ఆమెకి లలిత కళలంటే ఇష్టం. సత్యజిత్ రాయ్ సినిమాలన్నా ఇష్టమే. తమ కుటుంబంలో ఎవరికీ ముసుగు ధరించే అలవాటు అంతగా లేదని ఇటీవలే ఆమె ఒక విలేఖరితో చెప్పింది. డా. జకీర్‌హుస్సేయిన్ సతీమణి మాత్రం తమ గ్రామానికి వెళ్ళినప్పుడు మాత్రం బురఖా వేసుకుంటారుట.

కుమారి నిలోఫర్‌కి నేతచీరలంటే ఇష్టం.

# గదాధరుడు

ఒక శతాబ్దం కిందటి సంగతి. కలకత్తాలో మాథుర్ అనే ఆయన ఉండేవాడు. ఒకనాడు ఆయన కాశీకి బయలుదేరాడు. ఆయన వెంటే బంధువులు, మిత్రులు, పరిచారకులు చాలామంది బయలుదేరారు. వీరిలో గదాధరుడనే బ్రాహ్మణ యువకుడు కూడా ఉన్నాడు. గదాధరుడి వివేకం, దైవభక్తి మాథుర్‌ని బాగా ఆకర్షించాయి. అసలు మాథుర్‌కే దైవభక్తి అధికం. అందుకనే అతన్ని వెంట తీసుకు వెళ్ళాడు.

దారిలో వారు ఒక గ్రామంలో ఆగారు. ఆ గ్రామంవారు అప్పుడు కరువుతో ఎంతో బాధపడుతున్నారు. వారి బాధలని చూసి సహించలేకపోయాడు గదాధరుడు. గ్రామవాసులందరికీ భోజనం పెట్టి, వస్త్రదానం కూడా చెయ్యవలసిందిగా కోరాడు మాథుర్‌ని.

'వీరందరికీ తిండీ గుడ్డలు పెడితే మన ప్రయాణానికీ డబ్బు మిగలదేమో,' అన్నాడు ఆయన.

గదాధరుడికి ఆయన సమాధానం నచ్చలేదు. 'అయితే నేను ఇక్కడే ఉండిపోతాను!' అన్నాడు కన్నీరు ధారాళంగా జారగా.

గదాధర్ కరుణ మాథుర్‌నికూడా కదిల్చివేసింది. వెంటనే వారందరికీ బట్టలు తెప్పించి, భోజనం పెట్టించాడు. ఆ తర్వాత అతని పరివారం కాశీ ప్రయాణం కొనసాగించింది.

ఆనాటి గదాధరుడే తర్వాతి రామకృష్ణ పరమహంస అయ్యాడు. ఆధునిక భారతదేశంలోని ఋషి అయ్యాడు. ఆయన దివ్య సందేశం ప్రపంచం నలుమూలలా మారుమోగింది. నేడు 'రామకృష్ణ మిషన్' కి ఎన్నో విదేశాలలో శాఖలు ఉన్నాయి.

గదాధరుడు బెంగాల్‌లోని ఒక చిన్న గ్రామంలో పుట్టాడు. వీధిబడిలో చదువు నేర్చుకున్నాడు. తన పదహారవయేట కలకత్తాకి వచ్చి దక్షిణేశ్వరంలోని కాళికాలయంలో అర్చకుడుగా చేరాడు. ఈకాలంలోనే అతని జిజ్ఞాస పెరిగింది. ఒకనాడు తోతాపురి అనే సాధువుతో ఆయనకి పరిచయము కలిగింది. తోతాపురి అతనికి జ్ఞానభిక్ష ప్రసాదించి సన్యాసం స్వీకరింపచేశాడు. 'రామకృష్ణ పరమహంస' అనే పేరు పెట్టాడు.

అతి త్వరలోనే రామకృష్ణ పరమహంస కీర్తి విశేషంగా పెరిగింది. ఆయన ఉపన్యాసాలని వినటానికి ఎందరో వచ్చిపోయేవారు. శిష్యగణం ఒకటి ఏర్పడింది. వీరిలో ముఖ్యుడు స్వామి వివేకానంద!

రామకృష్ణుడు గ్రంథాలేవీ రాయలేదు. కాని ఆయన ప్రసంగాలన్నిటినీ ఒక శిష్యుడు రాసుకునేవాడు. వాటన్నిటినీ కలిపి ప్రచురించారు. ఫ్రెంచి రచయిత రోమారోలా అన్నట్లు, 'ముప్ఫయికోట్ల హైందవుల రెండువేల సంవత్సరాల ఆధ్యాత్మిక జీవనం యొక్క ఫలమే రామకృష్ణుని ప్రవచనాలు!'

—ఎస్

వంటలు :

## రష్యన్ టీ

టీ... మనిషికి ఒక చెంచా
నిమ్మరసం
చక్కెర
నిమ్మకాయ... అవసరమయినన్ని

టీ మీద మరిగిననీళ్ళుపోసి 5 నిమిషాలు అలాగే ఉంచిన తర్వాత గ్లాసులలో పోసి సన్నగాకోసిన నిమ్మకాయ 'చక్రాల'ని వెయ్యాలి. ఎవరికి కావలసినంతవారు నిమ్మరసం, చక్కెర వేసుకోవచ్చు.

—ఎ. వి.

# పరిష్కృతం

మధుశ్రీ




మూర్తి మడత మంచం మీద పడుక్కొని రంగా వారి కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు. పాలవెల్లువలా వున్న వెన్నెట్లో ప్రకృతి బుతుస్నాత అయినట్లుగా ఉంది. కొబ్బరి ఆకుల్లో దోబూచులాడుతున్న చందమామ, పిల్లగాలులకే అల్లాడిపోయి పరుగులు పెడుతున్న మబ్బుపిల్లలు, అతని కెంతో హాయిమనిపించాయి.

ఎక్కడనుంచో బయలుదేరి వచ్చిన చిరుగాలి చల్లగా గదిలో ప్రవేశించి అతన్ని పలుకరించింది. అతని మనసులోని నిర్మలంగా ఉన్న కాసారంలో అలలు రేపింది. అతని మనసు అనేక విషయాల మీద నుంచి తిరిగి తిరిగి సుబ్బులు దగ్గరకొచ్చి ఆగిపోయింది. ఆమెని గురించి ఆలోచించ సాగాడు.

ఆలోచించిన కొద్దీ సుబ్బులు మీద అనురాగంలాంటిదేదో అతని మనసులో ప్రవేశించి ఆమె రూపాన్ని మనః ఫలకం మీద చిత్రించుకోవడం మొదలు పెట్టాడు.

**తన దగ్గర సుబ్బులెందుకలా ఉంటుంది?** సుబ్బుల్లో అతను చూసిన అందాలు ఇంకే ఏ కాలేజీ అమ్మాయిల్లోనూ చూడలేదు. ఇప్పటికి తను నాలుగు సంవత్సరాలుగా చదువు సాగిస్తున్నాడు. కాని ఒక్క సంవత్సరం కూడా సుబ్బుల్లాంటి పిల్లని చూడలేదంటే ఎంతమాత్రం ఆశ్చర్యంలేదు. ఆ బిగువూ, ఆ పొంకం ఎంతమాత్రం ఏ అదృష్టదేవతకో కాని ఉండవు. కాలేజీ చదువులవల్ల ఎండిపోయి అక్కుపక్కుల్లా ఉన్న అమ్మాయిలు సుబ్బులుని చూసి సిగ్గుపడతారంటాడు మూర్తి.

తన గదిలో దిగీదిగగానే పనిమనిషి కోసం వెదికాడు. అతనికి చెయ్యవలసిన పనులు రెండే రెండు. హోటల్ నుంచి కారియర్ తేవడం, గది తుడిచి కూజాతో నీళ్ళు తేవడం.

ఇంటివారి పనిమనిషి నడిగాడు. అప్పటికే తను నాలుగిళ్లలో పని చేస్తూండడంవల్ల తనకి కాళీ లేదంది. అయినా ఆలోచిస్తానంది. అప్పటికే సుబ్బులు ఈడేరి రెండు నెలలైంది. విద్యార్థుల గదుల్లో పనికి పెట్టడం తనకంత ఇష్టంలేకపోయినప్పటికీ, పరిస్థితుల్ని ఆలోచించుకుని, ఆమెను తీసుకొచ్చి మూర్తి పనులకు కుదిర్చింది.

లేడి లాగ ఎగిరిపోతూ పని చేసుకుపోతోంది సుబ్బులు. పేరు కూడా ముద్దుగా ముచ్చటగా ఉందనుకున్నాడు, వికాసోన్ముఖంగా ఉన్న మల్లెమొగ్గ లాగ. కవటాకు లాగ ఊగిపోతూ, చక్రాల్లా కళ్ళు తిప్పుతూ మాట్లాడుతుంది.

'అసలా కళ్ళల్లోనే ఉంది' అనుకొని ప్రక్కమీద వాలాడు మూర్తి. ఆమె నవ్వు తల్చుకున్నప్పుడల్లా అతని మనసులో కోటి దీపాలు వెలుగుతాయి. ఆనందాల పరసతో ఓలలాడుతుంది అతని మనసు.

*　　*　　*

తెల తెల్లవారుతూంది.

'బాబుగారూ!...'అంటూ తలుపు గుంజుతున్నారెవరో. మూర్తి లేచి బద్ధకం వొదిలిపోయేటట్లు వొళ్ళు విరుచుకుని తలుపు తీశాడు.

సుబ్బులు వచ్చేసింది. ఎప్పుడూ లేంది అవ్వేళ సుబ్బులు కళ్ళల్లోకి చూస్తూండిపోయేడు మూర్తి.

'ఊం...తప్పుకోండి. గది తుడవాలి.' అంటూ లోపలకొచ్చేసింది సిసింద్రీలాగ, సూరేకారం పాలు ఎక్కువైన తారాజువ్వ లాగ. గది తుడవడం మొదలుపెట్టింది.

సూర్యుడికేసి చూసిన తరువాత కళ్ళు చీకట్లు కమ్మినట్లు అయిపోయిందతని పరిస్థితి.

అలాగే నిలబడిపోయాడు.

సుబ్బుల్లో చిలిపితనం గిలిగింతలు పెట్టింది. ఆమె అమాయకత్వం చూస్తే మేతకై పోయిన తల్లికోసం ఎదురు చూసే లేగదూడ జ్ఞాపకం వచ్చింది.

నడుస్తున్నప్పుడూ ఊగిపోయే ఆమె నడుం మాట్లాడుతూన్నప్పుడూ, చిన్నగా నవ్వేప్పుడూ ఒంకర్లు సొంపుగా తిరిగే ఆ కెంబంగాలూ అతని మనసులో ఒక ఆకృతి నేర్పరుచుకున్నాయి నెగెటివ్ ఫిల్మ్ మీద బొమ్మల్లాగ.

'చూడు సుబ్బులూ—ఇవ్వేళ నేను హోటల్‌కి పోలేను కాని, ఆ ఫ్లాస్కులో కాఫీ పోయించుకుని తెచ్చి పెడతావూ?' అడిగాడు మూర్తి కడుక్కున్న ముఖం టర్కిష్ టవల్‌తో తుడుచుకుంటూ.

'దానికంత ఇదెందుకండీ—తెచ్చి పెట్టమంటే తేనూ?' అని మళ్ళీ—

'టిఫిన్ అక్కర్లేదాండీ?' అంది నవ్వుతూ.

ఆమె బుగ్గల్లో కెరటాలు లేపింది ఆ నవ్వు.

'వొద్దులే!'

అనగానే ఫ్లాస్కు పట్టుకుని ఒక్క గంతులో ఎగిరిపోయి క్షణంలో సందు మలుపు తిరిగింది సుబ్బులు.

దూరంగా మబ్బుల్లో మెరుపు మెరిసినట్లనిపించింది మూర్తికి. ఒక్క పావుగంటలో సుబ్బులు ఫ్లాస్కుతో ప్రత్యక్షమైంది. మూర్తి ఆమె గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆమెకేసి కన్నార్పకుండా చూస్తూనే ఉన్నాడు.

'ఏమిటండీ అలా చూస్తున్నా రివాళ? కాఫీ తీసుకొచ్చాను.' అంది నవ్వుతూ.

ఆ నవ్వు గుండెల్ని దేవేసింది. జగన్మోహిని తన చిరునవ్వుతో 'పరమేశ్వరుణ్ణి కూడా పాదాక్రాంతుణ్ణి చేసుకున్నట్లు మనసులో మల్లెలు జడివాన కురిసినట్లైంది.

'అబ్బే—అంత వేగంగా ఎలా తెచ్చావా? అని.'

'ఆశ్చర్యంగా ఉందాండీ—' చిలిపిగా ప్రశ్నించింది.

మూర్తి మాట్లాడలేదు.

మూర్తి ఫ్లాస్కు అందుకోగానే కూజా పట్టుకుని కుళాయిదగ్గరికి పరుగుపెట్టింది సుబ్బులు.

ఆనాడు —

ఆమె ప్రతీ కదలికలోనూ వనమయూరి నృత్యాలూ, ప్రతీవొంపులోనూ నయాగిరా జలపాతపు సౌందర్యం, ఆమె పెదవి విప్పితే అమృతం కురిసినట్లు అనిపించింది మూర్తికి.

అతను కాఫీ త్రాగడం పూర్తి చేసేసరికి సుబ్బులు చకచకలాడుతూ కూజాతో వచ్చింది. కూజా బరువునే సహించలేక ఆమె నడుం ఊగిపోతోందా అనుకున్నాడు.

'ఇదిగో ఈ కాస్త కాఫీ తీసుకో!'

'మాకెందుకండీ కాఫీ— ఆర్చుకు పోడానికి'

'ఫర్వాలేదు ఇవ్వేళ్టికి తీసుకో'

'అలవాటైతే మాకెక్కడొస్తుందండి?' అని.

'మరి నే పోతున్నానండి' అంది మళ్ళీ జవాబుకోసం చూస్తున్నట్లు అమాయికమైన ఆ చూపుల్లో అనూహ్యమైన భావాలు దాగిఉన్నట్లనిపించింది. లెక్కలు 'సాల్వ్' చెయ్యలేని విద్యార్థిలా ఉన్నాడతను.

'ఊఁ' మూలిగాడు.

'వెడుతున్నా నండోయ్' అంది సుబ్బులు రోడ్డుమీదికి వెళ్ళిపోయి.

మూర్తి మేలుకొన్నాడు.

'సాయంకాలం వస్తావుకదూ'

'అడగడం ఎందుకండీ—మామూలుగానే వస్తానుకదా' అని కేకపెట్టింది.

మూర్తికి సిగ్గనిపించింది.

ఆ రోజల్లా మూర్తికి సుబ్బులుమీదే ఆలోచన. ఎందుకలా చూస్తుంది. ఏమిటీ కొంటెతనం.

'సుబ్బులుగురించి ఎందు కాలోచిస్తావ్? ముక్కుపచ్చలారని పసిపిల్ల! అమాయకురాలు.' అని వెన్నుమీద ఎవరో చరిచి నట్లైంది.

'అవును సుబ్బులు అమాయకురాలే. తననీ తనభావాల్నీ తన చూపుల్లోని విషం అర్థం చేసుకోగలిగితే తనదగ్గరంత చనువుగా మసులుతుందా? తనదగ్గిరపని చేస్తుందా? ఇదేమన్నా గోలయితే తను ముఖమెత్తుకుని వీధిలో తిరగ్గలడా? అనుకోగానే తనకి సుబ్బులు దూరమైపోయినట్లూ, తనలోని సంస్కృతి తన ఆరాధ్యదేవతని దహనం చేస్తున్నట్లూ బాధపడ్డాడు. తను చదువుకోకుండా ఉండిపోతే ఇటువంటి ఆలోచనలకి తావులేదు. ఎటువంటి పనైనా ధైర్యంగా, సిగ్గంటే ఏమిటో తెలియకుండా చేసేవాడు.

సుబ్బులుమీద తనకి ప్రేమ ఉందా? ఎల్లకాలం సుబ్బుల్ని తనదృష్టితో చూడ గలడా. ఏమైనా సుబ్బుల్ని వదిలి ఉండడం కష్టంగా తోచింది.

* * *

సాయంకాలం కాలేజీ వదలగానే తిన్నగా రూమ్‌కే వచ్చాడు మూర్తి. బట్టలు మార్చుకున్నాడు. ఒక అరగంటసేపు విశ్రాంతి కోసమన్నట్లు కిటికీదగ్గర వేసుకున్న పడక కుర్చీలో మేను వాల్చాడు. కిటికీలోంచి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

సుబ్బులు వచ్చింది.

'బాబుగారూ' అని పిల్చింది. అతని హృదయతంత్రులు సున్నితంగా మీటినట్లుగా అనిపించింది.

'గది తుడవాలాండి'

'ఆఁ!' అన్నాడతను గది శుభ్రంగా ఉన్నప్పటికీ.

ఆమె ఊడ్వడం ప్రారంభించింది.

అప్వేళ నీటుగా తయారయి వచ్చింది సుబ్బులు. అసలెప్పుడూ సాయంకాలం కాబోయేసరికి తలదువ్వుకుని శుభ్రంగా ఉంటుంది. ఆరోజు మరీ అందంగా తయారయింది.

చిరుగులతో ఉన్న జాకెట్టు ఆమె వయస్సుని దాచలేక పోతోంది. ఆమె నల్లగానే ఉంటుంది. అయినా ఆ నలుపులోని అందాన్ని చూడగలడు మూర్తి. ముఖంలో కళ ఉండాలికాని నలుపులో ఏముందనేవాడు.

అలాగని. ఆమె కారు నలుపు మనిషి కాదు. ఉబికి ఉబికించే ఆ యవ్వనపు పొంగుకి ఆ బట్టలు ఆగలేక పోతున్నాయి...

'సుబ్బులూ' పిల్చాడు. ఆతరువాత ఏదో చెబుదా మనుకున్నాడు. కాని కంఠంలో

మళ్ళీ తిరిగి పోయేయి అతను చెప్పదల్చు కున్న మాటలు.

'ఏమండీ?' ముఖం పైకెత్తి అతని ముఖంలోకి చూసింది. కనుబొమలు లేచాయి. ఆ కళ్ళు ఒక్కసారి తళుక్కుమన్నాయి. మరి మాట్లాడలేక పోయేడు మూర్తి.

'ఎందుకండీ పిల్చేసి ఊరుకుంటారు?' అని ముసిముసి నవ్వులు నవ్వింది.

'నీళ్ళు కూజాలో ఉన్నాయి. అవి పార బోసి మంచివి పట్రా.'

ఇది అర్థంలేనిపనిగా తోచింది. కూజాలో నీళ్ళు కొబ్బరిచెట్టు మొదట్లో పుండి మళ్ళీ నీళ్ళు పట్టి తెచ్చింది. కూజాలో నీళ్ళతోటికి జాకెట్ తడిసింది. అసలే జీర్ణమైన జాకెట్టు పయోధ రోత్సేధానికి తట్టుకోలేక రొమ్ముల్లో కూరుకుపోయింది.

ఏదో ఒకటి మాట్లాడాలని అనుకున్నాడు.

'జాకెట్లు మంచివి లేవేమిటి?' అమాయకంగా ముఖంపెట్టి ప్రశ్నించాడు మూర్తి.

'మాకెలా వస్తాయండీ' ఎదురు ప్రశ్న వేసింది. మళ్ళీ మూర్తి మాట్లాడకుండానే 'టిక్కెట్టు ఇవ్వండి. హోటల్ కెళ్ళి భోజనం పట్టుకొస్తాను.' అని కారియర్ తీసుకుంది చేతిలోకి. ఒక టిక్కెట్టు చింపి ఇచ్చాడు. అది తీసుకుని వీధిలోకి అప్పుడే అలుముకుంటున్న చీకట్లలోకి కలిసిపోయింది.

మూర్తి పడకకుర్చీలో వాలాడు. అప్పుడే కొద్దిగా తుంపర రాల్తోంది ఒక్కొక్క చినుకు ఎలక్ట్రిక్ దీపాలకాంతిలో మెరుస్తోంది. ఎన్నో ఆలోచించాడు మూర్తి. చివరి కతనికి తేలింది మానవ జీవితాలు ఆ నీటి బుడగలు మాత్రమేనని. ఇంత క్షణికమైన జీవితంకోసం మానవు డెందు కిలా ప్రాకులాడుతాడు. బుద్బుదప్రాయమైన జీవితంలో ఎన్ని దుష్కృత్యాలకైనా వెను దియ్యడే! కాని వెర్రి మొర్రి వేదాంతాలతో కాలం పాడుచేసుకుని ఆనందమయమైన జీవితాన్ని పాడుచేసుకునేంతటి వెర్రివాడు కాడు మూర్తి. అవకాశంలేని వాళ్ళు వాదించుకునే శూన్య విషయాలవి. మూర్తి ఒక స్థిర నిశ్చయాని కొచ్చాడు. యవ్వనం కొత్తగా పుట్టిన పువ్వు లాంటిది. పరిమళం ఉన్నంతలోనే దాన్ని సద్వినియోగం చేసుకోవాలి. ఈ విధంగా సాగుతూన్న ఆలోచనా పరంపరల్ని గది బయట అడుగుల సవ్వడి

## పరిష్కృతం

ఖండించింది. ఆ వైపుకు చూశాడు. వీధి లైటు వెల్తురు కిటికీగుండా వచ్చి మూర్తి మీద పడుతోంది.

'లైటు వేసుకోకుండా చీకట్లో కూర్చున్నారేమిటి?' అంటూ సుబ్బులు కారియర్‌తో గదిలో కాలుపెట్టింది.

సుబ్బులు కంఠంలో వొణుకు కనుపట్టింది మూర్తికి. బట్టలు తడిసిపోయేయి. గాలి చలిగా ఉంది.

'అబ్బే ఏమీ లేదు.' లేచి స్విచ్ వైపు నడిచాడు. 'చలిగా ఉందా?' స్విచ్ కోసం తడుముతున్నట్లుగా నిలబడ్డాడు. లైటు వెయ్యలేదు.

అతని గుండెలు గుబగుబ లాడాయి. కాళ్ళాడటంలేదు. నోట మాట రావడం లేదు; చిన్న కుర్రాడి నోటికి పెద్ద మిఠాయి ఉండ కూరేసినట్లుంది అతని పరిస్థితి.

'వేసేస్తా నుండండి' అంటూ దగ్గర కొచ్చింది సుబ్బులు. సుబ్బులు అతనిచేతికి తడిగాతగిలింది. అతనిలోని కోరికల సుప్త భుజంగాలు పడగవిప్పాయి. బలంగా ఆమెను చేతుల్లోకి తీసుకున్నాడు.

'అదేమిటండి అలా పట్టుకుంటారు' అంది పూడుకుపోతున్న గొంతుతో.

'నువ్వంటే నాకిష్టం సుబ్బులూ'

'మా అమ్మకీ, నాన్నకీ కాక మీకూ ఇష్టమే నన్నవమాట' అంది అమాయకంగా.

'ఔను' అన్నాడు.

వెర్రిపిల్లలాగ ఇదేటండీ అంటూ ప్రేలాడి పోయింది.

మర్నాడు ప్రొద్దున్నే మూర్తికి తన ముఖం చూపించటానికి సిగ్గనిపించింది. అనేకసార్లు ఆమె మూర్తిని వారించాలని అనుకుంది. కాని అది ఆమెకు సాధ్య పడలేదు. అది మొదలు సుబ్బులు తనకి ఆటబొమ్మ.

* * *

రెండునెలలు గడిచాయి...

ఒకనాడు సుబ్బులు పనిలోకి రాలేదు. వస్తుంది వస్తుందని ఎదురుచూశాడు, చంద్రోదయాని కెదురుచూసే కలువ పువ్వులాగ. ఆ రోజు తనకేమీ తోచింది కాదు. మరునాడూ రాలేదు. చెప్పకుండా సుబ్బులు మానివెయ్యటం అతనికి తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్లుంది.

ఇంటివారి పనిలోకి ఆమె తల్లికూడా రాలేదు. 'ఏ జ్వరమైనా వచ్చిందేమో!' అని సుబ్బులు ఇంటిమొగమై నడక సాగించాడు మూర్తి. అక్కడిదాకా వెళ్ళాడన్న మాటే గాని, ఆ గుడిసెల్లోకి వెళ్ళడానికి అతని లోని అహం అడ్డు వచ్చింది.

వెనక్కి తిరిగాడు—

గది చేరుకున్నాడు. చీకటి పడింది. కుర్చీలో కూర్చున్నాడు. తనగది ముందర ఒకమనిషి నిల్చుండడం చూశాడు. అతని చేతిలో ఒక దుడ్డుకర్రకూడా ఉంది. లైటు వేశాడు. అతనికళ్ళు నిప్పులు కక్కుతున్నాయి.

వాడిని చూసేసరికి నిలువునా నీరై పోయేడు మూర్తి. మనిషిని విరుచుకు తినే టట్లున్నాడు.

'మీరేనా మూర్తిగారు.'

'ఔను'

'సుబ్బులుకి ఒంట్లో బాగోలేదు. ఎక్కువగా ఉంది. పాతికరూపాయలైనా ఇస్తే కాని రానంటున్నాడు డాక్టర్. మీ మూలాన్ని చూడండి సుబ్బులెంత బాధపడుతూంది. ఏదో మందేయించారు పోవడానికి. కిందామీదా అన్నట్లుంది దానిపని' అన్నాడు.

సుబ్బులు ఎందుకురాలేదో మూర్తి కర్థమైంది. కాళ్ళకింద భూమి దిగి పోతున్నట్లుగా అనిపించింది. ఎవరో పీక నులిమి వేస్తున్నట్లుగా గిలగిల్లాడిపోయేడు.

'ఏమిటదీ?' పెద్దకేక పెట్టాడు.

'ఏం? దాన్ని వలలో వేసుకున్నప్పుడు కనబడలేదటయ్యా... ఊ రానీ...' ఉరిమాడు. గత్యంతరం లేకపోయింది. మూడు పదులు దీసి చేతిలో పెట్టాడు. మీసాలు తిప్పుకుంటూ విషపునవ్వు నవ్వి వెళ్ళి పోయేడు.

'అమ్మయ్య!' అనుకున్నాడు మూర్తి.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు.

* * *

'బాబుగారూ' చీకట్లోని పిల్చుకుంటూ వచ్చిన సన్ననిపిలుపు, నిద్రలేకుండా ప్రక్క మీద దొర్లుతూన్న మూర్తికి వినిపించింది. ముసుగు తీశాడు.

తలుపు దబదబ బాదుతున్నారు.

లేచి తలుపు తీశాడు ఎదురుగుండా సుబ్బులు తల్లి. వికారంగా ఉంది. నిద్రలేని ముఖంలో డ కన్నీటి చారికలు స్పష్టంగా కనబడుతున్నాయి.

'బాబ్బాబు—ఒక్కసాయం చేసిపెట్టాలి. డబ్బు లేదు, డాక్టర్ రానంటూన్నాడు. పిల్లని రక్షించాలి. వీరారెడ్డితే వస్తాడు. పిల్లని రక్షించండి బాబూ' ఏడుపు మొదలు పెట్టింది.

ఆ ఏడుపు లోకానికి ఏడుపు అన్నట్లని పించింది మూర్తికి. మూర్తి కర్థంకాలేదు. రాత్రే కదూ బుగ్గమీసాలవాడికి ముప్ఫయ్ రూపాయ లిచ్చింది. మళ్ళీ డబ్బు అంటు న్నారేవిటి?

మూర్తి చొక్కా వేసుకుని డాక్టర్ దగ్గ రికి పరుగుపెట్టాడు. డాక్టర్‌ని తీసుకుని సుబ్బులు ఇంటికి వెళ్ళాడు. సుబ్బులుకి వాతం కమ్మింది. రక్తం ఎంతపోయిందో లెక్కలేదు. డాక్టర్ పరీక్షించాడు. పెదవి విరిచాడు. రాత్రే కనక తనవద్దకు వస్తే కొంత వీలువుండేదన్నాడు డాక్టర్.

'రాత్రి వచ్చేం బాబూ. తమరు రాలేదు. మా ఖర్మం బాబూ...నిక్షేపంలాంటి పిల్లని ఏ వెధవ పాడుచేశాడో...మందేస్తే ఇలా ముంచుకొస్తుందని అనుకోలేదు బాబూ...' విలపిస్తోంది సుబ్బులు తల్లి.

'ఔనమ్మా కాలం అలా ఉంది! ఎవర్ని చూసినా నమ్మడానికి వీలులేదు.' అంటూ మూర్తికేసి చూశాడు.

మూర్తి కుంచించుకుపోయేడు ... కత్తి వాటుకి నెత్తురుచుక్క లేదతనిలో.

'అలా మందిచ్చి పాడుచెయ్యి కూడ దమ్మా...పిల్లల్ని కన్నాక ఆ దౌర్భాగ్యు డెవడో వాడి దగ్గరికి తీసికెళ్ళి వదిలేస్తే వాడే ఏలుకున్ను.' అన్నాడు డాక్టర్ ముందుకు అడుగువేస్తూ.

'డాక్టర్ బాబూ...వాడెవడో చెప్పమని ఎన్నో వేడుకున్నాం...చెప్పింది కాదు... చచ్చినా చెప్పనంది!' అని కళ్ళు తుడుచు కుంది.

'అమ్మా!' అని మూలిగింది. కళ్ళు విప్పింది సుబ్బులు. ఒక్కసారి అందరి ముఖాల్లోకి చూసింది.

మూర్తి, డాక్టర్ కనబడ్డారు.

'బాబుగారూ ఇంక వీరాకు పని చెయ్య లేను' అని అనగలిగింది. సుబ్బులు కళ్ళు మూసింది.

మూర్తి, డాక్టర్ తిరిగి వెళ్ళారు. దార్లో జువ్వి చెట్టు దగ్గర క్రితం రాత్రి వచ్చి డబ్బు తీసుకున్న బుగ్గమీసాలవాడు మూర్తిని చూసి మీసాలు దువ్వి వికటంగా నవ్వాడు. ఆతని నవ్వుల విషపు కత్తులు మూర్తిని దూసేసేయి. మూర్తికి తరువాత కాని తెలియలేదు, వాడి బ్రతుకంతేననీ, వాడు ఆ గుడిసెల్లో లేనిపోని సంబంధాలు కట్టి డబ్బు గుంజుతూంటాడనీ...గబ గబ గదికి వెళ్ళి కుర్చీలో మొదలు నరికిన చెట్టులా పడిపోయేడు.

ఈ లోకంలో ఉండదగ్గది కాదు. అమా యకురాలు, తన కోరికలకు బానిస, తన దామానికి బలి అయింది.

కళ్ళు గిర్రుని తిరిగిపోయేయి.

అమాయకంగా చూస్తూ, కటికివాడి వెంట బడ్డ మేకపిల్లలా, తన చుట్టూ తిరుగుతూంది సుబ్బులు ప్రతిబింబం. విషపు నవ్వులు నవ్వుకుంటూ, డబ్బు మరో చోట ఎలా పిండడమా అని ఆలోచించుకుంటూ ఆ బుగ్గమీసాల ఆసామీ, ఏమయినా సరే తన ఫీజు చెల్లిస్తే కాని కాలు కదపనని భీష్మించిన డాక్టర్...తన కళ్ళ ఎదుట తిరుగుతున్నారు.

అంతిమ క్షణాల్లోకూడా తన రహస్యాన్ని బైట పెట్టకుండా ఉన్న సుబ్బుల్లోనా మానవత్వం ఉన్నది?

స్వలాభంకోసం పర ప్రాణాల్ని లెక్క చెయ్యని డాక్టర్ మానవుడా?

నిత్యం దగాయే వృత్తిగా కలిగిన బుగ్గ మీసాలవాడా మానవుడు?

పెద్దమనిషిగా సంఘం కళ్లల్లో కారం జల్లి చెలామణీ అవుతున్న తనా మానవుడు? తన ప్రతిబింబాలు వివిధ కోణాల్లో తన చుట్టూ తిరుగుతున్నాయి.

కాని—

ఒకేఒక్క ప్రశ్న వేసుకున్నాడు చివరికి.

డాక్టర్ అన్నట్లుగా, సుబ్బులు తన పేరే కనక చెప్పివుంటే, దాని తల్లిదండ్రులు దాన్నీడ్చుకువచ్చి తన కాళ్ళదగ్గర పడేస్తే, ఆమెను స్వీకరించగలిగిన సభ్యత, మానవత్వం, సంస్కృతి తనకున్నాయా?

జ్ఞానోదయం అయినట్లుగా జవాబు కోసం బుర్రగోక్కున్నాడు మూర్తి. భగ వంతుడే తనకీ సమస్య తీర్చాడు అని అనుకో దించక పోలేదు. ●






కాలింగ్‌బెల్ గణగణ మనటం' గడియారం అయిదు కొట్టటం ఒక్కసారే జరిగాయి.

శారద కొంచెం కంగారుపడింది.

'మా అతిథి కాలంకంటే ముందుగా పరుగెడుతున్నాడే!' అంటూ ఫ్లవర్ వేజ్‌లో రంగురంగులపూలు సర్ది టేబిలుమీద వుంచింది. సరిగ్గా వున్నాయో లేవోనని కర్టన్లవంక ఓమారుచూసి తృప్తిపడ్డట్టు తల నిలువునా ఆడించింది.

'ఆరుగంటలకు వస్తానన్న వ్యక్తి గంట ముందుగానే వచ్చినట్టున్నాడు.

సరే!...తలుపుతియ్యి—రిసీవ్ చేయటానికి నేను సిద్ధంగా వున్నాను!

అని హెయిర్ పిన్ను సరిచేసుకునేసరికి మరో సారి గంట గణగణమంది.

తలుపుతీసిన శారద ఆశ్చర్యంతో కంటి రెప్పలు రెండుసార్లు టపటప లాడించి పకపకమంది.

ఆ వచ్చింది మేం ఎదురుచూసిన అతిథి కాదు.

అది పక్కింటి పరమానందంగారు.

ఆయన లోపలికివస్తూ 'ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్టున్నారు.

'నాకోసం కాదని తెలుసు. పానకంలో పుడకలా ప్రవేశించినందుకు క్షమించండి...నిన్నట్నుంచి మిమ్మల్ని కలుసుకుని ఓ ముఖ్యమైన విషయం చెప్పాలనుకుంటున్నాను... మీకు తీరికవుంటే ..మరి' అన్నారు.

'మీ వినయవిధేయతలకు చాలా సంతోషించాను. ఇలా వచ్చి కూర్చోండి. శారదా! ...పరమానందంగారు కొంచెం డల్‌గా వున్నారు. ఓకప్పు స్పెషల్ కాఫీ తీసుకురా—మీగోడు వినేముందు నా ప్రశ్నలకు సూటిగా సమాధానం ఇవ్వండి. రవణ నాలుగురోజులుగా కనిపించటం లేదేం?... స్కూలుఫైనలు పరీక్షా ఫలితాలు వచ్చాయి కదా! ... అతనికి క్లాసు వచ్చిందా?... నాకు మిఠాయి ఇచ్చాడుకాదు...నాతో చెప్పకుండా ఎలా వుండగలిగాడో ఆశ్చర్యంగా వుంది.'

పరమానందం విషాదంగా నవ్వారు. నాకు కొద్దిగా భయంవేసింది.

ఒకవేళ రవణమరి ఫెయిలయ్యాడేమో!... ఛ!...అలాంటిది ఎన్నటికీ జరగదు. రవణ లెక్కల్లో వెనకంజ వేసేవాడు. మూడు నెలలుగా తరిఫీదు తీర్పించుకున్న తరువాత అలాంటి అవకాశం ఏ మాత్రం లేదు...ఒక వేళ వంటో బాగాలేదేమో!...పరమానందం గారికి రవణ ఒక్కగా నొక్క కొడుకు. కాస్త ముక్కుచీదినా గడగడ లాడిపోతారు.

'ఆ సంగతే మీతో చెబుదామని వచ్చాను. అతను ప్యాసయ్యాడు. క్లాసుకూడా వచ్చింది.. కాలేజీలో చేర్పిద్దామనుకున్నాను...కాని...'

'కాని?...' అని శారద కాఫీ నుందుం చింది.

'కాని, తనకు కాలేజీ చదవాలని లేదంటాడు...ఎందుకో, పై చదువంటే చలిజ్వరం వచ్చినట్టుందట!...ఎన్నివిధాల ప్రయత్నించినా, కాలేజీకి, అతనికి మధ్యవున్న వైరం ఏమిటో కనుక్కోలేక పోయాను. వ్యాధి ఏమిటో నిర్ణయిస్తేనేకదా మందివ్వటానికి—ఇంటో అందరం చెప్పిచూశాం—బెదిరించానుకూడా—కాని, నా అభిమతం మిల్లీమీటరంత కూడా ముందుకు సాగలేదు.'

'మరి ఏంచేద్దామనుకుంటున్నాడు?' అని ఆశ్చర్యపోయింది శారద.

'వ్యాపారం చేస్తానంటాడు......అంటే నాదగ్గర తరిఫీదు పొందుతాడట—కాలేజీ చదువులు చదివి ఉద్యోగం అనేపేరుతో స్వచ్ఛమైన ఆత్మకు బానిసత్వం అంటగట్టడట—ఇవి వాడిమాటలు సుమండీ,'

నామనసు కొద్దిగా తేలికపడింది.

'మైగాడ్!...ఏదోవైపరీత్యం జరిగిందని భయపడ్డాను...ఇంతేకదా! అతనికి చదువుకోటం ఇష్టంలేకపోతే మనం నిర్బంధించకూడదు...అతని దారికి అడ్డం పడకండి. మీకన్నాకూడా పైకొస్తాడు. అనుకున్నదానికంటె ముందుగా వ్యాపారం అతనికప్పగించి మీరు హాయిగా విశ్రాంతి తీసుకోవచ్చు—'

'మీ అభిప్రాయం సరైందికాదు. వ్యాపారం ఓ విద్య—స్పెషలైజ్డ్ ఆర్ట్—దానిక్కూడా కొంత విద్య, సంస్కారం అన్నీ అవసరం. కాలేజీలో చదువుకుంటే మనసు వికసిస్తుంది. మంచి, చెడూ—రెండూ ఎదురవుతాయి కనక ఏదికావాలో ఎన్నుకునే శక్తివస్తుంది...అందుచేత మీరతనికి నచ్చచెప్పండి...మీమాట కాదనడు. కుర్రతనంలోని వాగుడికి తలాతోకాలేదు. ఆకారంలేదు.

పరమానందంగారు ఎందుకొచ్చారో అప్పుడుకాని అర్థంకాలేదు. ఆయనన్నట్టు రమణ నేను గీచినగీటు దాటడు—అది నిజం—రమణకు నామీదున్న గౌరవాభిమానాల్ని కొలిచేందుకు కొలతబద్దలేదు.

రమణ లెక్కల్లో చాలావీక్ — నాలుగు నెలలపాటు ఇస్త్రీవేసినట్టు తరిఫీదిస్తే పెలక్షను పరీక్షల్లో నూటికి ఎనభై మార్కులు గుంజుకున్నాడు. అతను నామాటను మకుటంలా పూజిస్తాడు. ఉదయం ఏడుగంటలక్కాని నిద్రలేవని రమణ 'కొంచెం పెందలాడే లేచిచదువుకుంటే బాగుంటుంది' అన్నంతమాత్రాన అయిదింటికే లేస్తున్నాడు. వారానికి రెండు సినిమాలు చూసిన రమణ నా సలహామీద సినిమాలు చూడటం మానుకున్నాడు...... ఇదంతా భయంతోనూ, బలాత్కారంతోనూ కాదు...అతని మనస్థితిని ఎనలైజ్ చేస్తే, నామాట వినటం, నన్ను తృప్తిపరచటం—అతనికో మహదానందాన్ని ఇచ్చినట్టు కనిపిస్తుంది.

'నా మాటకు జవాబు ఇచ్చారుకారు—' అన్నారు పరమానందం.

.ఈ ఒక్కవిషయంలో నన్ను క్షమించండి—మన అభిప్రాయాలను ఒకరిమీద రుద్దటం ఉభయపక్షాలకూ మంచిదికాదు.'

పరమానందం తెల్లబోయారు.

మీ మాటలు చిత్రంగా వున్నాయండీ!... అతనింకా చిన్నకుర్రాడు. తనకేదికావాలో తెలుసుకోలేనిప్రాయం. అనుభవమున్న మనం నిర్ణయించాలి...'

'నేను ముందే చెప్పాను. ఈపని నావల్ల కాదు.'

ఇంతకటువుగా నేనెప్పుడూ మాట్లాడటం ఎరుగని శారద మబ్బుపట్టిన ఆకాశంలా చూసింది.

పరమానందంగారి మనసు గాయపడిందని నాకు తెలుసు. కాని ఏంచేయను?

'మిమ్మల్ని శ్రమపెట్టినందుకు క్షమించండి...వస్తాను—' అని వెళ్లిపోయారు. శారద మూతి ముడుచు క్కూర్చుంది...నవ్వుకున్నాను.

'నువ్వు కోపగించుకోటంలో తప్పేమీ లేదు. నేను చెప్పేదంతా విన్నాక, నాప్రవర్తన సరైందని ఒప్పుకోక తప్పదు.'

'కాశీమజిలీకథ వినేందుకు, కుర్రకారు వుబలాటపడ్డట్టు శారద నాముందు కూర్చుంది.

''రమణను చూసినప్పుడల్లా నాకు గోపాలం జ్ఞప్తికొచ్చేవాడు......ఆకారంలో ఇద్దరికీ పోలికలేక పోయినా, మాటలతీరు, అభిప్రాయాలు, గుణగణాలు — వీటిలో ఇద్దరి మధ్య ఎంతో సాన్నిహిత్యం వుంది.

బి. ఏ. పూర్తయ్యాక, అందరికీ మల్లే వుద్యోగంకోసం తిరిగితిరిగి, కాళ్ళరిగి, తల తిరిగి మూలబడుతుంటే ఓ పల్లెటూళ్లో మేష్టరిగిరి వచ్చిపడింది. గుడ్డిలో మెల్లన్నట్టు ఎగిరి అందుకున్నాను. స్కూలు ఫైనలువరకూ లెక్కలు బోధించటం నావిధి. అప్పుడే నాకు గోపాలం కనిపించాడు. నలభైమంది విద్యార్థుల్లో అతను నన్నెక్కువగా ఆకర్షించాడు. అందుక్కారణం అతను శ్రీమంతుడనికాదు — చదువుల్లో పై అంతస్థులో వున్నాడనీకాదు—ఫలానా అని చెప్పలేను—సన్నగా, పొడుగ్గా వుండేవాడు. ఆనందంతో కలిగిన అనురాగం, ఆత్మతృప్తి కళ్లల్లో కనిపించేవి.

'క్లాసులో లెక్కలు అర్థంకానివారు, నాదగ్గరికి వస్తే బోధపరుస్తాను, అని ఓనాడు క్లాసులో ప్రకటించాను. ఫీజులేకుండా ప్రైవేటు చెబుతా నన్నందుకు పిల్లలందరూ ఆశ్చర్యంగా చూశారు.

ఆ సాయంత్రం గోపాలం బెదరుబెదరుగా పుస్తకాలతో ప్రత్యక్షమయ్యాడు, లోపలకు రమ్మని కూర్చోమన్నాను. మొదటి రెండు నిమిషాలు అతనినోటంట ఒక్కమాటకూడా బయటపడలేదు. దిక్కులుచూస్తూ నిలబడ్డాడు. చివరకు ధైర్యం తెచ్చుకుని లెక్కలు చెప్పించుకోటానికి వచ్చానన్నాడు. తనకు నూటికి ఇరవైకంటె ఎక్కువ మార్కులు ఎప్పుడూ రాలేదన్నాడు.

అదే మాపరిచయానికి మొదలు.

ఆనాటినుండి గోపాలం తరచు వచ్చేవాడు. మొదట్లోవున్న బిడియం క్రమంగా కరగిపోయింది. ఊళ్ళో వున్న వ్యక్తుల్ని గురించి, స్కూల్లో విద్యార్థుల మనస్తత్వాన్ని గురించి వర్ణించేవాడు. అతని మాటలు వింటుంటే ఒక్కోసారి మనస్తత్వ వేత్తలా కనిపించేవాడు.

రమణకు మల్లే గోపాలంకూడా, మూడు నెలల్లో లెక్కల్లో ఎనభైమార్కులు సంపాదించాడు. రోజులు తెరచెక్కి పోయినకొలదీ, అతనికీ నాకూ మధ్యవున్న ఆత్మీయత అంతరంగంలో జీర్ణించుకుపోయింది. మా యిద్దరికీ వున్న అనుబంధం అంతులేని కాలంలా నిలిచిపోయింది. ఒకసారి నాకు జ్వరంవస్తే రాత్రింబగళ్ళు నాదగ్గరలోనే వుండి సపర్యలు చేశాడు.'

గడియారం మరో అరగంట ముందుకు పరుగెత్తి తను ఎక్కడున్నదీ ప్రకటించింది.

గోపాలం స్కూలుఫైనలు ప్యాసయ్యాడు.

...రీక్షా ఫలితాలు వచ్చినరోజున అతని తల్లిదండ్రులు నాకు బుట్టెడు మామిడిపళ్ళు పంపించారు... ఆ తియ్యదనం చేదులోకి దిగి, ఇవరకు విషంగా మారి నన్ను దహించి వేస్తుందని నేను కలలోకూడా అనుకోలేదు.

'ఇంక ఏం చెయ్యదల్చుకున్నావ్?' అనడిగాను.

అతను నవ్వి వూరుకున్నాడు.

ఆ తరువాతి పదిరోజులవరకూ కంటికి కనిపించనేలేదు. ఇంత దీర్ఘకాలం మేం కలుసుకోకుండా వుండటం ఇదే మొదటిసారి—

ఆ సాయంత్రం ఏదో పుస్తకం చదువుకుంటుంటే, గోపాలం తండ్రి సుబ్బన్న దండంపెట్టి నాకెదురుగా నేలమీద కూర్చున్నాడు.

ఏమిటి సంగతన్నట్టు చూశాను.

'ఏదో తమ దయవలన గోపాలం గట్టెక్కాడు. అతన్ని కాలేజీలో చదివిద్దామనుంది. తమరేమంటారు?'

'ఇందులో అడుగటానికేముంది?...తప్పకుండా చదివించాల్సిందే! కాకినాడ కాలేజీలో చేర్పించండి. వారానికోసారి మిమ్మల్నందర్నీ వచ్చి చూసిపోతుంటాడు—'

'నేనూ అలాగే అనుకొన్నానండి.. వాడిక చదవనంటాడండి. కాలేజీ అంటే మనసలే కిట్టదట—'

'అయితే ఏం చేస్తానంటాడు?'

'వ్యవసాయం...' సుబ్బన్న ఏడుస్తున్నాడేమోననిపించింది.

# పొగమంచు

'ఎవరికి ఏ వృత్తిలో అభిలాషవుంటే ఆ వృత్తిలో రాణించటం మంచిది....' అన్నాను.

'మీరలా అంటే ఎలాగండి?.... నేను మిమ్మల్ని నమ్ముకుని వచ్చాను. నేను అయిదో క్లాసుదాకా చదివి, ఇక చదువొద్దని మొండికెత్తి ఇలా అయ్యాను. పెద్దవాడు కూడా నాలాగే చదువుసంధ్యలు లేక వ్యవసాయంలో పడ్డాడు. ఉత్తరంముక్క రాయాలంటే పరాశ్రయం తప్పదు.....మా కుటుంబంలో ఒక్కడైనా పైచదువులు చదివి ఉద్యోగం చేయగా చూడాలని ఆశ...నేను చెబితే వినడు. పైగా నా కుపదేశం చేయటం మొదలుపెట్టాడు.'

సుబ్బన్నను చూస్తే జాలేసింది.

ఆ సాయంత్రం గోపాలం వచ్చాడు. ఎలాంటి కట్టడానికైనా పునాది ఎలా అవసరమో, అలాగే ఏ వృత్తికైనా చదువు, సంస్కారం అవసరమని వివరించి చెప్పాను.

'మేష్టారు! అందరూ చదువుకుని వుద్యోగాలు చేస్తే పంటలెలా పెరుగుతాయండి?.. మనదేశపు జనాభా నానాటికీ పెరిగిపోతోంది. మనం విదేశాలనుండి తిండిగింజలు దిగుమతి చేసుకుంటున్నాం. దేశం స్వయం సమృద్ధిగా వుండాలంటే కొందరు వుద్యోగాలు చేయటం మానక తప్పదు. అన్నీ తెలిసిన మీరే ఇలా అంటే ఎలా?...' అని ఎదురు ప్రశ్న వేశాడు.

నేను తెల్లబోయాను...అతనివంక పరీక్షగా చూశాను. పద్దెనిమిది సంవత్సరాలు నిండాయి. అంతే—ఈ స్వల్ప వయసులో అతను, దేశాన్ని చీడపురుగులా దొలిచివేస్తున్న సమస్యను ఎంతబాగా అర్థం చేసుకున్నాడు?

'నువ్వన్నది నిజమే!...కాదనను కాని నిన్ను పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులకు ఋణపడి వున్నావు. వారిమనసు కనుగుణంగా నడుచుకుంటే ఆ ఋణం తీరినట్టవుతుంది.'

గోపాలం అంత తేలిగ్గా ఓటమిని అంగీకరించే రకం కాదు. ఏదో అనబోయాడు.

'నాతో నువ్వు వాదించక్కర్లేదు. నువ్వు చదివి తీరాల్సిందే—అన్ని కోణాల్లోంచీ ఆలోచించి, ఈ నిర్ణయానికి వచ్చాను... ఔను—కాదు—ఈ రెండింటిలో ఏదో ఒకటి చెప్పు— అంతే— ' అని సంభాషణను తుంచివేశాను.

'సరేనండి...' అన్నాడు.

ఆ మర్నాడు ఇద్దరం కాకినాడ వెళ్ళి వచ్చాం. అతనికి సబ్జెక్టులు పైనలులో మార్కులు బాగా రానందున కాలేజీలో ప్రవేశం దొరకటం కష్టమని కనీసం నలుగుర్ని కనుక్కొని తెలుసుకున్నాం. ఎందుకైనా మంచిదని భీమవరం, రాజమండ్రి కాలేజీలకు కూడా దరఖాస్తులు రాసిపడేశాం.'

శారద గడియారంవంక చూసింది

'మీ అతిథి పదిహేను నిమిషాల్లో వచ్చేస్తాడు...మీ కథ పదినిమిషాల్లో ముగించేయాలి.' అని హెచ్చరించింది.

వంటాయన, బిస్కట్లూ, మిక్చరూ తీసుకొచ్చి ప్లేట్లలో సర్ది టీపాయ్ మీదుంచాడు.

గోపాలానికి భీమవరం కాలేజీలో చోటు దొరికింది...తతిమ్మా రెండు కాలేజీలూ మౌనంగా వుండిపోయాయి. అతని తల్లిదండ్రులు కొడుకును విదేశాలకు పంపుతున్నట్టు బాధపడ్డారు. పుట్టినప్పట్నుంచి, ఈనాటివరకూ కొడుకును విడిచివుండలేదట. గోపాలం మాత్రం ఎప్పటిలాగే వున్నాడు.

కాలేజీలో చేరాక రెండు మూడుత్తరాలు రాశాడు. అక్కడి వాతావరణానికి, తనకూ మధ్యవున్న భేదం కొద్దికొద్దిగా పల్చబడుతోందని. తను బాగా చదువుకుంటున్నానని రాశాడు...తల్లిదండ్రులు మాత్రం, తనను చూసేందుకు, సెలవులకోసారైనా వచ్చిపొమ్మని వుత్తరాలు రాశారు. ఈ విషయం తెలిశాక



# స్నేహానుబంధం కిసాన్ స్క్వాష్‌తో




కిసాన్ స్క్వాష్ అధునాతన జీవిత నిర్మాతల అపూర్వ కల్పన! ఆహా! ఏం రుచి! ఉల్లాసవంతమైన నిచ్చెలులకు దీని ప్రత్యేకమైన రుచి ఉత్తేజాన్ని కలిగిస్తుంది. సహజమైన విటమినులతో ఆరోగ్య దాయకంగా ఉంటుంది. నారింజ నిమ్మ, మామిడి ఇంకా ఇతర రకాలనుండి మీకిష్టమైన దానిని వాడండి

భారతదేశంలో విస్తారంగా అమ్ముడుపోయే కిసాన్ స్క్వాష్‌లలో అసలు పళ్ళరుచిని అనుభవిస్తారు.

కిసాన్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ బెంగళూరు

కిసాన్ స్క్వాష్ బ్రిటానియా క్లబ్ స్నాక్స్‌తోను, టిన్ షెల్‌లతోను ఎంతో రుచి!

# పొగమంచు

వారిని మందలించాను. అతనితో పరివర్తన తీసుకురావాలంటే వారికి దూరంగా వుండి తీరాలన్నాను.'

కాలింగ్‌బెల్ గణగణ మంది.

'విహా అతిధికి ఇండియన్ స్టాండర్డ్ టైంలో ఎంత నమ్మకం!' అంటూ తలుపు తీయబోయింది. నేను ముఖం మీదికి చిరునవ్వు తెచ్చుకుని, సుస్వాగతం పలికేందుకు సిద్ధపడ్డాను.

శారద తలుపుతీయటం, ఫెడీమని మూయటం ఒక్కసారే జరిగాయి.

'ఎవరో అడుక్కునేవాడు...నాగరికత పెరిగినకొలదీ ఈ ఏర్గానికి చెందినవారు 'అమ్మా! అయ్యా! బిచ్చం పెట్టండి.' అనరు—ఎవరో డాక్టరు—ఎం. ఎల్. ఏ.—లేక వోడిపోయిన పవిత్రాత్ముడు సంతకం పెట్టిన అప్పీల్ చూపించి పళ్ళికిలిస్తారు. ఫలానా మనిషికి డజను సంతానం. ఎం. ఏ. చదివాడు. పసందైన వుద్యోగం చేశాడు. నాలుగుమేడలు, మూడు కారులూ వుండేవి. దురదృష్టంకొలదీ ఇలా అయిపోయాడు. అతని కూతురికి పెళ్ళి—లేక కొడుక్కి చదువు చెప్పించాలి...సాయపడండి. అని...

శారద విసుగ్గా నాకెదురుగా కూర్చుని 'కథ పూర్తి చేయండి' అంది.

'నువ్వు అస్తమానం "కథ—కథ" అంటే నాకు చెడ్డకోపం వస్తుంది. ఇది నిజంగా జరిగింది.'

'తప్పు—ఇకముందు అలా అనను—' అని ...అదీకాక, ఇంటిని గురించి బెంగగావుంది.'

చెంపలు వాయించుకుంది.

'ఓనాడు సాయంత్రం. గోపాలం హఠాత్తుగా నాగదికి వచ్చాడు. 'ఏమోయ్!...ఎప్పుడొచ్చావ్?... ఈ వేళ వుదయం కూడా మీ నాన్నను చూశాను. నీ రాకగురించి ఏమి చెప్పలేదే!' అన్నాను.

'నేను వస్తున్నట్లు ఎవరికీ తెలియదండి. ఉన్నట్టుండి వచ్చేశాను—అంతే' అన్నాడు.

సంధ్యాకాలంలో ఆకాశం క్షణానికో రంగు మార్చినట్టు, అతని ముఖంలో భావ పరంపరలు సముద్రతరంగాల్లా దొర్లిపోయాయి.

'బాగా చదువుకుంటున్నావా?...క్వార్టర్లీ పరీక్షలైపోయాయా? నేను కాలేజీ విడిచిపెట్టిన ఈ మూడు సంవత్సరాల్లో విద్యార్థుల మనస్తత్వాలు, పోకడలు ఎలా మారాయో తెలుసుకోవాలని కుతూహలంగా వుంది.' అన్నాను.

'మేష్టారూ!...మీతో ఓ విషయం చెప్పాలి. నన్ను క్షమిస్తానంటే చెప్తాను.'

'నేను క్షమించినంత మాత్రాన నీ అభిమతం నెరవేరుతుందా?' అని ఎదురుప్రశ్న వేశాను.

గోపాలం సూటిగా జవాబివ్వలేదు.

'నేను కాలేజీ మానేశానండి—పెట్టె బేడాతో భీమవరం వదలి వచ్చేశాను. నాకు చదువుకోటానికి మనసు కలిసిరావటంలేదు

గోపాలం భయంతో వణకుతున్నాడేమో ననిపించింది.

'నేను అనుకున్నంతపని చేశావ్. ఇప్పుడు నీకు పద్దెనిమిది సంవత్సరాలు—నువ్వు వందేళ్ళు బతుకుతావనుకో—అతి మహా ఐతే రెండు సంవత్సరాలు నీ తల్లిదండ్రులు వళ్ళో బజ్జోగలవా?...ఏదో ఒకనాడు వాళ్ళు నీకు అందనిచోటికి దూరంగా వెళ్ళిపోతారు—బహుశ నువ్వుకూడా అప్పుడు గాలిలో కలిసిపోతావు గావోలు'

అతను మాట్లాడకుండా తలవంచుకుని నిలబడ్డాడు.

నాకు ఏంచెయ్యాలో తెలిసిందికాదు. ఇతనితో తర్కబద్ధంగా వాదించి లాభంలేదు.

'నువ్వింతటి తెలివితక్కువ దద్దమ్మవని, ఆడదానికున్న మనోధైర్యం, స్థిరత్వంకూడా లేదని ముందే తెలిసివుంటే నీ విషయంలో జోక్యం కలుగజేసుకునేవాణ్ణి కాను. నువ్వు వ్యవసాయమే చేస్తావో, వడియాలుచేసి అమ్ముతావో నాకెందుకని వూరుకునేవాడిని. నీ కోసం పడినపాట్లు మరో విద్యార్థికోసం పడివుంటే నా శ్రమకు తగినఫలితం లభించేది...కాలేజీచదువు నీకెందుకు నచ్చదు? అదేమన్నా బ్రహ్మరాక్షసా?... మొదట్నించి నువ్వు ఓవిధమైన అసహ్యతను కల్పించుకుని, పెనుభూతంలా దాన్ని పెరగనిచ్చి, ఇప్పుడది నిన్ను మింగేయటానికి వస్తుందని భయపడుతున్నావు. నువ్వు పట్టి పిరికిపందవు కళ్ళులేనివాడికి ప్రపంచపర్యటన లెందుకు? నువ్వు ఎలా తగులడ్డా నాకు బాధలేదు.... ఇక్కణ్ణించి వెళ్ళిపో' అనరిచాను. కన్నీరు చెంపలవిూదుగా ప్రవహించింది.

వెక్కివెక్కి ఏడవనారంభించాడు.

'మేష్టారూ!....ఇలా మాటల్తో నన్ను చంపకండి...'

'గోపాలం!...ఏడ్చి ఏం లాభం? నా మాట విూద గౌరవం వుంటే మళ్ళా వెళ్ళి కాలేజీలో చేరు. ప్రిన్సిపాలు ఏమైనా అంటే నా కుత్తరం రాయి. పరిస్థితులు వివరించి సాయపడతాను....అంతేకాదు....నువ్వు లన్ని సబ్జెక్టుల్లో నూ ప్యాసవ్వాలి. లేకపోతే నీముఖం నాకు చూపించకు. మనం అపరిచితులమనుకో.'

గోపాలం వెళ్ళిపోయాడు.

అంత కటువుగా మాట్లాడనందుకు బాధపడ్డాను. మంచిమాటల్తో అతని మనసు



మార్చలేను. అతనికి నామీదుండే అనంతమైన గౌరవాభిమానాన్ని పనిముట్టుగా వుపయోగించుకోటంకంటె గత్యంతరం కనిపించలేదు... వెలుగును చేరుకునేందుకు చీకట్లోంచి వెళ్ళినా ఫరవాలేదని నన్ను నేను వూరడించుకున్నాను.'

గడియారం గమ్యస్థానం చేరినప్పట్లో, విజయదర్పంతో ఆరుసార్లు జయభేరి ప్రయోగించింది.

'అన్నమాట అక్షరాలా నిలబెట్టుకునేవారున్నంతవరకూ మనదేశం బాగుపడదు.... దేశ సౌభాగ్యానికి దోహదం చేస్తున్న మీ అతిథికి ధన్యవాదాలు—' అంది హేళనగా శారద.

ఆ తరువాత గోపాలం ఒకటి రెండు సార్లు సెలవులకు వచ్చాడు. ఎప్పటిలాగే వున్నాడు. అర్ధ సంవత్సరం పరీక్షల్లో ప్యాసయ్యానన్నాడు. మనిషి వుత్సాహంగానే కనిపించాడు.

ఏప్రిల్ నెల వచ్చింది. నేను ట్రెయినింగ్ ప్యాసవలేదు కనుక, మేష్టరిగిరి నిలుస్తుందా అన్న ప్రశ్న ఎదురైంది. హెడ్మాస్టరు హామీయిచ్చినా, నిజం అందకుండా దాక్కుంది.

ఓనాడుదయం సుబ్బన్న పరుగెత్తుకొచ్చాడు. అతను ఓక్షణం భయంతో గజగజ లాడాడు. మరోక్షణం పిచ్చివాడిలా చూశాడు. జుట్టు పీక్కున్నాడు.

'మేష్టారూ!... కొంప మునిగింది!... దీపం ఆరిపోయింది. అయ్యో!...ఇంక నేనేంచేయను? —నా కింకెవరు దిక్కు?'

అతను భోరుమన్నాడు.

'ఇంతకూ ఏమైంది' అని గద్దించాను.

సుబ్బన్న ఓ టెలిగ్రాం అందించాడు. చదవగానే గుండె ఆగినట్లైంది.

అది భీమవరంనుండి, గోపాలం రూంమేటు ఇచ్చిన టెలిగ్రాం. గోపాలం విషంమ్రింగి, ప్రమాదస్థితిలో ఆస్పత్రిలో వున్నాడట—చివరిసారిగా చూడాలనుంటె వెంటనే వెళ్ళాలిట—నేను కూలబడిపోయాను. అంతా శూన్యంగా కనిపించింది.

'గోపాలాన్ని చంపిందెవరు?...' అన్న ప్రశ్న ఆకాశమంత ఎత్తున ఎదురుగా నిలబడి వికటంగా నవ్వింది. భయంకరంగా కళ్ళు అటూయిటూ కదిపింది... ఆ నవ్వు వినలేక చెవులురెండూ గట్టిగా మూసుకున్నాను.

'మేష్టారూ!..నా గోపాలాన్ని బతికుండగా

# పొగమంచు

ఒక్కసారైనా చూడగలనాండి?'...సుబ్బన్న దీనంగా అడగాడు.

నేను వాస్తవికతలోకి తిరిగివచ్చాను. మనసుకు ధైర్యం చెప్పుకుని అతనితో ఆపూరి డాక్టరుదగ్గరకు పరుగెత్తాను. అదృష్టంకొలదీ ఆయనకారు అక్కడేవుంది. డ్రైవరుకూడా వున్నాడు.

'మీరుకూడా రండి మేష్టారూ!...నాకు ఏమీ పాలుపోవటంలేదు' అన్నాడు సుబ్బన్న.

నాకాళ్ళు రెండూ వణకాయి. నేలమీద ఎప్పుడు కూలిపోతానో అనిపించింది గోపాలం మృతశరీరాన్ని చూసేందుకు ఏముఖంతో వెళ్ళను? అతన్ని ఆడిపోసుకున్నానుకాని, నిజంగా నేనే పిరికిపందను. తప్పుచేసిన మనసూ ముందుకు సాగనంది. ఎలాగో మనో ధైర్యాన్ని శరీరంలో బంధించి అతనిపక్కన కూర్చున్నాను... మళ్ళీ అదేనవ్వు—

'సుబ్బన్న!...నామనసు ఏం బాగలేదు—నేనురాలేను— అంటూ కారుదిగి అరుగుమీద కూలబడ్డాను.

సుబ్బన్న మాట్లాడలేదు. గ్రామంలో వుండే ఒకరిద్దరిని తోడుతీసుకుని కారులో బయలుదేరాడు.

నేను నా గదికి వెళ్ళి పడుకున్నాను. అన్నం సయించలేదు. విషం మింగినతరువాత మనిషి బతకటం అరుదు. చాలాను కున్న గోపాలం దారుణమైన, తిరుగులేని విషం తినుంటాడు. తనివితీర ఏడ్చాను, చక్కగా వ్యవసాయం చేస్తూ, నవీన పద్ధతుల్లో పంటలు పండించి, పెళ్ళాం పిల్లలతో హాయిగా వుంటూ, ఒకానొకరోజున ఎక్కువ పంటలు పండించినందుకు రాష్ట్రపతి మెప్పుపొందవలసిన గోపాలం?...తలచుకోడాని క్కూడా భయంగా వుంది. నా మూర్ఖత్వం వలన పెరిగి పెద్దదై, పుష్పించి, కాయలు కాచి, పళ్ళు రాల్చవలసిన మొక్కను మొద లంట నరికివేశాను. నా చేతులు రక్తసిక్తమైనట్టు బాధపడ్డాను.

ఆ సాయంత్రం పోస్టుమాన్ ఓ కవ రిచ్చాడు. కవరుమీది దస్తూరీ చూసేసరికి గుండె గతుక్కుమంది. అది గోపాలం రాసింది. చించి చదివాను. తను మొదటి సంవత్సరం పరీక్షల్లో అయిదు సబ్జక్టుల్లో ఫెయిలయ్యాడట, అందుచేత, నేను విధించిన నిబంధన ప్రకారం తన ముఖం నాకు చూపించకూడదనుకున్నాడట. ఇంక ప్యాసు గగన కుసుమం కనక ఆత్మహత్య చేసు కుంటున్నానని, తనను క్షమించవలసిందని. రాశాడు....అంతేకాదు – తను అర్ధసంవత్సరం పరీక్షలో ప్యాసైనట్టు నాతో చెప్పినది నిజంకాదు. అన్ని సబ్జక్టుల్లోనూ ఫెయి లయ్యాడు. ప్రిన్సిపాలు కూడా అతనికి చదువు రాదన్నారట—

ఇంతటి చిన్న విషయానికి, ప్రాణం తీసుకున్నాడంటే నమ్మలేకపోయాను. ఆ మర్నాడు ఆ వూరు విడిచిపెట్టేశాను. రెండు మూడు నెలల వరకూ కంటిమీద సరిగ్గా కునుకు వచ్చేదికాదు. బొంబాయి వచ్చి వుద్యోగంలో స్థిరపడ్డాక సుబ్బన్నకు రెండుమూడుత్తరాలు రాశాను. గోపాలం గురించి ప్రస్తావించాను...ఎందుకో గోపాలం బతికి బయటపడుంటాడని నాకో వెర్రి నమ్మకం...సుబ్బన్న నాకు జవాబు రాయ లేదు. ఎలా రాస్తాడు?...హంతకులతో అతనికేంపని?.. గోపాలాన్ని మర్చిపోవటానికి ఇంకా ప్రయత్నిస్తూనే వున్నాను.

ఇప్పుడు తెలిసిందా? రవణను చదువుకో మని ఎందుకు బలవంతం పెట్టలేదో!'

'చిత్రమైన విద్యార్థి!' అంది శారద.

కాలింగ్‌బెల్ గణగణ మంది.

'నన్ను వేపుకుతినేందుకు మళ్ళీ వచ్చి పడినట్టున్నారు.' అని విసుక్కుంటూ తలుపు తీసింది.

మరుక్షణం చిరునవ్వుతో 'రండి' అని ఆహ్వానించింది.

నేను ఎదురుచూసిన అతిథి— కుమార్ వచ్చేశాడు.

కుమార్ మద్రాసులో—కంపెనీ మానే జరు. మా మిల్లులో వుత్పత్తి అయ్యే బట్టల విక్రయానికి ఏజన్సీ తీసుకునేందుకు వచ్చాడు. మద్రాసు రాష్ట్రానికంతా ఏజన్సీ తీసుకోబోతున్నాడు కనక, ఎన్నో విషయాలు మాట్లాడుకోవాలి. అందుకని ఇంటికిరమ్మని ఆహ్వానించాను.

కుమార్ నవ్వుతూ కరచాలనం చేశాడు.

'ఆలస్యమైంది ... క్షమించండి—' అని సోఫాలో కూర్చున్నాడు.

కుమార్ ఆరడుగుల మనిషి — టెరిలీన్ సూట్‌లో మంచి హుందాగా వున్నాడు. కాని, అతని ముఖం ?...అవును...ఎక్కడో

చూసినట్టుంది. శారదను పరిచయం చేశాను. ఆ ముఖం?...మళ్ళీ అదే ప్రశ్న — మీసాల వెనక దాగిన ఆ నవ్వు ?...అమాయకంగా చూసే కళ్ళు ? నిజమే...అతనే అయుంటాడు...అసంభవం — అలా ఎన్నటికీ జరగదు. మనిషిని పోలిన మనుషులుంటారు. శారద నా ప్రవర్తనను చూసి కొంచెం కంగారు పడింది.

'ఐయామ్ సారి మిస్టర్ శ్రీరాం!... మీకు వంటో బాగాలేనట్టుంది. మీకు శ్రమగా వుంటే, రేపో, లేక మరోనాడు వస్తాను' అన్నాడు కుమార్.

నా తెలివి తక్కువకు సిగ్గుపడ్డాను.

'అబ్బే !... అలాంటిదేమీ లేదండి. మిమ్మల్ని ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం వస్తే ఆలోచిస్తూ వుండిపోయాను...క్షమించండి...కమాన్! ఫలహారం తీసుకోండి— మీరు కాఫీ తీసుకుంటారా?'

'బతికించారు !... చూసినట్టుండటమే కాని, ఫలానా అని నిర్ణయించలేదు కదా!' అని కుమార్ విరగబడి నవ్వాడు.

తెర తొలగిపోయింది.. నా సందేహం తీరింది. లేచివెళ్ళి అమాంతంగా అతన్ని కావలించుకున్నాను .

'గోపాలం!...అవును...నువ్వు గోపాలమే ! ...నిస్సందేహంగా! శారీరకంగా నువ్వు మారినా, నీకళ్ళుమాత్రం మారలేదు.

గోపాలం — అదే కుమార్ — నవ్వాడు.

'మేష్టారూ!...నన్ను క్షమించండి. ఇంత కాలం మీకు దూరంగా వుండిపోయాను మీ నిబంధన ప్రకారం మీకు నా ముఖం చూపించే అర్హత ఇప్పుడు వచ్చింది.! శారద అతనివంక ఆప్యాయంగా చూసింది.

'గోపాలం ! ... ఏమిటిదంతా? ... నువ్వు బతికున్నావంటే నమ్మలేక పోతున్నా... ఇదంతా ఎలా జరిగింది?'

అతను నిమిషంపాటు ఏదో ఆలోచిస్తున్నవాడిలా తలవంచుకున్నాడు. తరువాత నెమ్మదిగా వివరించాడు.

'మేష్టారూ! ... నేను ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయత్నించినమాట నిజం — అందుక్కారణం మీకు రాసిన వుత్తరంలో వివరించాను— ఆ వుత్తరం మీకు అంది వుంటుందనుకుంటాను...తరువాత దేవుడి ఆయువలన ఎలాగో బతికి బయటపడ్డాను... ప్రిన్సిపాలుగారు నామీద జాలిపడి నన్ను ఆదుకోకపోతే పోలీసుల బారినుండి తప్పించుకునేవాడినికాను...తీరిగ్గా కూర్చుని ఆలోచిస్తే నేనుచేసిన పనికి సిగ్గుపడక తప్పింది కాదు...అన్నింటికంటె, మీరు ఎంత బాధపడుంటారో తల్చుకునేసరికి ఏడుపాగిందికాదు......ఆనాటినుండి నా మనసు మార్చుకున్నాను. దృక్పథం మారింది. ఓవిధమైన ఆవేశం-వెర్రిపట్టుదల వచ్చాయి. మనిషి తల్చుకుంటే ఏ పనైనా సాధించగలడన్న నమ్మకం వచ్చింది. ఫస్ట్ఇయర్‌లో ఫెయిలైనా, ప్రిన్సిపాలు దయతల్చి నన్ను ప్రమోట్ చేశారు...ఆతరువాత రాత్రింబగళ్ళు కష్టపడి చదివాను బి.ఏ — ఎం.ఏ — ఎల్. ఎల్.బి. అన్నీ పూర్తిచేశాను. ప్రస్తుతం హైకోర్టులో లాయరుగా ప్రాక్టీసు చేస్తున్నాను.

ఉలిక్కిపడ్డాను.

'అదేమిటి?...నిన్న టెలిఫోన్ చేసినపుడు నీపేరు కుమారని, ఏజన్సీ తీసుకోటానికి వస్తున్నానని, అపాయింట్‌మెంట్ కావాలని అన్నావు...అంటే నువ్వు నేను ఎదురుచూస్తున్న కుమార్‌వి కాదన్నమాట...'

'నా మాటలు పూర్తిగా వినండి... మీ వూరువెళ్ళి, మీరు బొంబాయిలో వుంటున్నారని తెలుసుకున్నా—అడ్రసు తీసుకుని, మిమ్మల్ని చూసేందుకు బయలుదేరి వచ్చేశాను...ఈ దీర్ఘకాలం తరువాత మనం కలుసుకోటంలో నావల్లే వుండనక్కర్లేదంటారా?...అందుకే పేరు కూడా మార్చుకున్నాను.' అని నవ్వనారంభించాడు.

మేం కూడా అతనితో కలిశాం.

'ఏమిటా అల్లరి?' అంది గడియారం.

ఆరున్నరైంది.

'అయితే గోపాలం !...ఒకరికి ఇష్టంలేని పనిని వారిచేత బలవంతంగా చేయించటం సరేనంటావా?'

గోపాలం ఓక్షణం మౌనంగా వున్నాడు.

'ఆ సిద్ధాంతాన్ని జనరలైజ్ చెయ్యలేం — కాని అలాచేయటంవలన మేలు కలుగుతుందని, కొన్ని విషయాల ప్రాధాన్యతను బట్టి నిర్ణయాలే, చేయవచ్చు'—

'నువ్వు సైకాలజీకూడా నేర్చినట్టున్నావు' అంది శారద.

'శారదా!...రవణను నేను రమ్మన్నానని చెప్పు. అతనికి బ్రెయిన్‌వాష్ చెయ్యాలి.' అన్నాను.

శారద అర్థమైనట్టు నవ్వింది. ●



# మట్టిబొమ్మలు



సీరియల్

తాడిగిరి పోతరాజు

### జ రి గి న క థ

వెంక(టామయ్యగారు వో హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాధ (ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాస్టరు కామయ్య ఆయనకు ఆప్తమి(త్రులు. వెంక(టామయ్యగారికి జబ్బుచేసి మరణిస్తారు. ఆయన భార్య అచ్చమ్మగారు తన తమ్ముడు శివరామయ్య కూతురు పూర్ణిమను మధుకు చేసుకోడానికి ఆయన్ను ఒప్పిస్తుంది. మ(ద్రాసులో చదువుకుంటున్న మధు సెలవులకని యింటికివచ్చి ఉత్సవాల్లో కామయ్య మాస్టారికూతురు శారదను చూస్తాడు. ఆకర్షించబడతాడు. కాని ఆమె వైముఖ్యాన్ని తెలుసుకుంటాడు. ఇది పసికట్టిన అచ్చమ్మగారు వెంటనే మధుచేత మ(ద్రాసు (ప్రయాణం కట్టిస్తుంది.

## 9

[illegible]ంచ ఆకారంలో నిర్మితమైన స్కూలు భవనం. మధ్య గదుల్లో (ప్రధానోపాధ్యాయుల కార్యాలయం — (ప్రయోగశాల — పఠనమందిరం — (ప్రక్క గదుల్లో తరగతులు — ఒక్కొక్క గదిలో ఒక్కొక సూక్తి ఆకర్షణీయంగా (వ్రాయబడింది. భవనానికి ముందు రోడ్డు వరకూ రెండెకరాల వైశాల్యంలో చక్కని తోట. ఆ తోటలో 'ప్లస్' ఆకారంలో నాల్గు రోడ్లు నిర్మించి దానిని నాల్గు భాగాలుగా విభజించారు. ఆ కూడలిలో అమరవీరుడు 'సుభాస్' వి(గహం.

ఒక్కొక్క చదరంలో ఒక్కొక్క రకం మొక్కలు — బావివద్ద చదరంలో అరటి తోట పచ్చగా కళకళ లాడుతోంది. దానికి ఎదురుగా నారింజలు — అంటు మామిళ్లు. మిగతా రెండు చదరాల్లోనూ రంగు రంగు పూలు పూస్తున్న వివిధమైన పూల మొక్కలు. వాటి మధ్యలో ఎ(ర్ర తురాయి టోపి పెట్టుకున్న యన్.సి.సీ. విద్యార్థుల్లా ఎ(ర్రమెట్ట తామరలు — నవ వధువుల్లా పసుపురంగు మెట్టతామరలు కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయ్.

భవనంనుండి (ప్రహరీ గేటుకు దారితీస్తున్న రోడ్డు కిరువైపులా కొబ్బరి చెట్లు.

ఆ వేళ విద్యార్థులు ఉరకలు పరుగులతో తిరుగుతున్నారు. భవనంపై ఎగురుతూన్న జాతీయపతాకం, దాని (ప్రక్కనే విద్యార్థులు రంగు కాగితాలు అంటించిన పురికొస తాళ్లు పట్టుకొని అరుస్తున్నారు. రోడ్డుపైనున్న 'ఆర్చి' తో భవనాన్ని కలుపుతూ ఆ రంగు కాగితాల తాళ్లు వివిధ కోణాల్లో కడుతున్నారు. గాలికి గలగల మని శబ్దంచేస్తూ ఆనందం పట్టలేక రెప రెప లాడుతున్నాయి రంగు కాగితాలు. విద్యార్థుల కోలాహలాన్ని తిలకిస్తూ వాళ్ళకు సలహాలిస్తున్నారు ఊరి పెద్దలు.

భవనపు వెనుకభాగంలో ఆరుబయట రంగస్థలం. దాని ముందు దాదాపు పదెకరాల విస్తీర్ణంగల భూమిని బహిరంగ సభలకు, (క్రీడలకూ కేటాయించారు. దాని చుట్టూ పిచ్చితుమ్మలు ఏపుగా పెరుగుతున్నాయి.

రంగస్థలం రంగు కాగితాల కత్తిరింపులతో, బెలూన్లతో కళకళ లాడుతోంది. రంగస్థలానికి కిరువైపులా రెండు గెలలున్న అరటిచెట్లు కట్టారు. వాటి వెనుక కొబ్బరి మట్టలు అర్ధచం(ద్రాకారంలో తీర్చిదిద్దారు.

ఉపన్యాస వేదికపై ఆకర్షణీయమైన పూల కుండీ — ఆ పాఠశాల (ప్రాంగణంలో పూసిన పువ్వులన్నీ వింత వింత రంగులతో అందులో ఇమిడి ఉన్నాయి ఆ టేబిల్ వెనుక ఉపన్యాసకులకు కుర్చీలు, వాటి వెనుకనున్న గోడపై పెద్ద సైజు ఫోటో ఒకటి, పుష్పమాలాలంకృతమై ఉంది. దాని (క్రింద అక్షరాలు — కీ. శే... (శీ... (శీ... వెంక(టామయ్యగారు.. జనన మరణాల్ని సూచిస్తూ సంవత్సరాలు.

ఊళ్లో ఒక్క పురుగు మిగలకుండ అంతా అక్కడకు చేరారు. (ప్రక్క ఊళ్ల జనంతో మరింత కిట కిట లాడిపోతోంది ఆ (ప్రాంగణం.

ఉపన్యాస వేదికపై ఏర్పాటు చేయబడిన 'మైక్' ముందు ఒక (ప్రముఖ వ్యక్తి కనిపించాడు. లాల్చీ... ధోవతి... ఇంత లావు (ఫేమున్న కళ్ళద్దాలు సవరించుకొంటూ జనసమూహానికి నమస్కరించాడు.

'కామయ్య మాస్టారు... కామయ్యగారు..' పెద్ద కలకలం బయలుదేరింది. ఆనందం పట్టలేక అందరూ చప్పట్లు చరిచారు, — పావురాల రెక్కల చప్పుడులా. వారు వేదిక నుండి ఆపమని సౌంజ్ఞ చేసేవరకూ అలా కొడుతూనే ఉన్నారు. ఆ పైన మాస్టార్ని పూలదండలమధ్య ముంచిపారేశారు. అన్ని కులాలవాళ్ళూ, తలకొక దండ తెచ్చి వారి పట్ల వాళ్లకున్న భక్తి (శద్ధలు — (ప్రేమాభిమానాలను నిరూపించుకొన్నారు. పదిహేను నిముషాలలో అంతా సద్దుమణిగింది. అందరూ మాస్టారి పెదవులపై దృష్టి నిలిపారు.

'మహాశయులారా! నేడు మనకొక శుభదినం. ఐదు సంవత్సరాలుగా మనం శక్తివంచనలేకుండ నిర్మించుకొన్న పాఠశాల భవనంలో నేడు (ప్రవేశించబోతున్నాం. ఇప్పటి వరకూ తాటాకుపాకలలో నిర్వహించిన తరగతులను ఇక్కడకు మార్చబోతున్నాం. ఈ భవననిర్మాణానికి ఉదారస్వభావంతో విరాళాలిచ్చి చందాలు (పోగుచేసి ఈ భవనం పూర్తయ్యేవరకూ కృషి సలిపిన మనకందరికీ నా కృతజ్ఞత. ఈ శుభసమయంలో మనతో

పాటు ఈ ఆనందాన్ని పంచుకోటానికి శ్రీ వెంకటావధానిగారు మనమధ్యలేకపోవటం ఎంతో విచారకరమైన విషయం. వారు మనకు దూరమైనప్పటికీ వారి లక్ష్యాన్ని మనం చేరగలిగినందుకు మన మందరమూ సంతోషించాలి. మరొక సంతోషకరమైన విషయమేమంటే మన పాఠశాలలో పదకొండవతరగతి అంటే యస్ యస్.యల్ సి. పెట్టుకోటానికి అనుమతికూడ దొరికింది.'

ప్రజలలో కరతాళధ్వనులు మళ్ళీ మిన్నుముట్టాయి. చెవులు గింగురుమనేలా ఈలవేశారు. మళ్ళీ ప్రశాంతత నెలకొనడానికి ఐదునిమిషాలు పట్టింది. మాస్టారి కంఠం 'మైక్'లో వినిపించింది.

'కాబట్టి ఈ శుభవార్తలన్నీ మీకు తెలియపర్చటానికే ఈనాడు మిమ్మలను ఇక్కడికి ఆహ్వానించటం జరిగింది. నేటి ఈసభకు అధ్యక్షత వహించవలసిందిగా మన హైస్కూలుకమిటీ శాశ్వత కార్యదర్శి శ్రీ శివరామయ్యగారిని కోరుతున్నాను.

రెపరెపలాడుతూన్న సిల్కుచొక్కా-పైన ఉత్తరీయం-ధోవతి చెంగు సరిజేసికొంటూ వచ్చి అధ్యక్షపీఠాన్ని అలంకరించాడు. వారి మెడలో ఒక దండవచ్చి వాలింది.

'తరువాత మొదటి ఉపన్యాసకులుగా మనజిల్లా విద్యాశాఖాధికారిగారిని వేదికపైకి రావాల్సిందిగా కోరుతున్నాను'...

విద్యాశాఖాధికారి వేదికపైకొచ్చి వేసిన దండను వెంటనే తీసి టేబిల్‌పై పెట్టాడు. అప్పటివరకూ హరిదాసులా వేసికొని కూర్చున్న అధ్యక్షులవారు అది చూసి, తనుకూడ దండతీసి టేబిల్‌పై పెట్టారు.

'రెండవ ఉపన్యాసకులుగా ప్రధానోపాధ్యాయులైన శ్రీ నరసింహరావుగారిని వేదిక పైకి రావాల్సిందిగా కోరుతున్నాను...'

ప్రజలలో భయంకరమైన నిశ్శబ్దత ఆవరించింది. అందరి ముఖాలు తెల్లబోయ్యాయి. నోళ్ళు తెరచుకొని మూడవ వ్యక్తికేసి చూడసాగారు. జరీఅంచు ఉత్తరీయం — కోటు — ధోవతితో స్థూలకాయాన్ని మెల్లగా మోసికొచ్చాడు వేదికపైకి.

సభ ప్రారంభించబడింది. అధ్యక్షులు కుర్చీ వెనక్కి జరుపుకొని లేచారు. ఒక చేత్తో 'మైక్'ను గట్టిగా పట్టుకొని దాన్ని మూతికి దగ్గరగా పెట్టుకొన్నాడు, మాటలు జారిగి ప్రక్కకుపోకుండ.

'ఈవేళ ఇదంతా ఎందుకు మనం చేస్తున్నామో పంతులుగారు చెప్పారు.' ఆ తరువాత ఆతని కంఠం వణికినట్లు మధ్యలో ఊఁ ఊఁ అని కొద్దిసేపు ఆగిపోయ్యారు. 'అసలు ఈవేళ ఇంతమంది జనం వస్తారని నేననుకోలేదు. ఎందుకంటే మన ఊళ్లోబడికదా? పొరుగూళ్లనుండి జనం రారనే నా నమ్మకం. కానీ అందరూ కోసూ రెండు కోసులనుండి కూడ నడిచి వచ్చారంటే మెచ్చుకోదగ్గవిషయం...అ... ఆఁ...మరీ ముఖ్యంగానే చెప్పదలచుకొన్నదేమిటంటే ఈ బడి మన ఊళ్లో బెట్టటాన చుట్టుప్రక్కల ఊళ్లనుండికూడ వచ్చి పిల్లలు చదువుకోటానికి ఈలుంది..



ఇదివరకు పిల్లల్ని చదివించుకోడలనుకున్న తల్లిదండ్రులు వాళ్ళను గుంటూరు పంపాల్సొచ్చేది. అక్కడ సదివించాలంటే— చదివించాలంటే డబ్బుకావాలి. పైన వసతులు ఇక్కడనే ఇళ్ళకాడ అమరినట్టు అమరవు— ఎట్టయినా ఉండూరు ... ఉండూరే...'

ఆ తరువాత రెండుసార్లు దగ్గు విని పించింది మైక్‌లో. ప్రజలో సన్నగా మాట్లాడుకోవటం ప్రారంభమైంది.

'పైన పిల్లలు వానకళ్ళముందుండరు. అందుకని నేఘా మా వెంకట్రామయ్య బావా కలిసి...నే మరచిపోయ్యా— అసలు దీనికి కథానాయకుడు మాస పంతులుగారు మేం ముగ్గురమూ కలిసి ఇంకా ఊళ్లో పెద్దలతో మాట్లాడి ఈ కొత్తగదులు కట్టించాం. ఈ గదులు కట్టటానికి రెండుమూడువేలచొప్పున చందాలిచ్చిన వాళ్ల పేర్లూ...ఆలెక్కలు ఆ పంతులుగారు చదివినిపిస్తారు. ఇంకా నేను.. నేను...మీరంతా కూర్చోవాలి...'

పెద్దగా అరుపులు మాట్లాడుకోవటం ప్రారంభమైంది ప్రజలు గుంపులు గుంపులుగా లేచి నిలబడ్డారు వలంటీర్లు కూర్చోబెట్టటానికి సతమతమైపోతున్నారు.

'మీరంతా కూర్చుంటేనే గానీ— ఈ మీటింగు జరగదు. దయచేసి కూర్చోండి. తరువాత—తరువాత ...నే చెప్పదలచుకొన్న యన్నీ పంతులుగారు చెప్పనే చెప్పారు'...

'మరి నువ్వెందుకు'...ఎవరో జనంలో

# మట్టిబొమ్మలు

అరిచాడు.

అయితే ఆకేక మామూలు రణగొణ ధ్వనిలో కలిసిపోయింది. అధ్యక్షులవారి ఉపన్యాసం ఇంకా కొనసాగుతూనే ఉంది.

'తరువాత ఇంకా నేను చెప్పదలుచుకొన్నదేమిటంటే-మన ఊళ్లో ఇంతకు ముందున్న సర్కారుబడిని పెద్దదిగా హైస్కూలు చేపించాలంటే ఇట్టా గదులు కట్టియ్యాలనీ— డబ్బు పోగు చెయ్యాలనీ సర్కారు చెప్పినప్పుడు... నేను వెనకా ముందాడకుండ ఎనభైవేలిచ్చాను— అది పొలంగానీ...రొక్కంగానీ...ఏ రూపేణయినా గానీ...ఇంతటితో నేను విరమిస్తున్నాను'... మన డి—ఓ'గారు మాట్లాడుతారు''...

ద్విగుణీకృతమైన ఉత్సాహంతో ప్రజలు చప్పట్లుకొట్టారు.

డి. ఇ. ఓ గారు లేచారు. బాగా వయసు మళ్ళిన వ్యక్తి. జోధ్‌పూర్‌కోటు పంట్లాం నెత్తిమీద నల్లని బొచ్చుటోపి — ఇంగ్లీషులో ఉపన్యాసం మొదలెట్టారు! అనువాదకులుగా ప్రక్కనే కామయ్యగారు నిలబడ్డారు.

'గౌరః అధ్యక్షా !...విద్యార్థులారా...పెద్దలారా ?

ఈ జిల్లాలో నా అజమాయిషీలో ఉన్న పాఠశాలలన్నింటిలోనూ, అతిస్వల్పకాలంలో అభివృద్ధికొచ్చిన పాఠశాల ఇది ఒక్కటే అని చెప్పటానికి సంతోషిస్తున్నాను. ఒక్కొక్క సంవత్సరానికి ఒక్కొక్క తరగతి చొప్పున ఇప్పటికి పూర్తి హైస్కూలు స్వరూపం ఏర్పరచుకొన్నారు, మీరు. దీనినిబట్టి తెలిన విషయమేమంటే, ఈ గ్రామస్తులకు విద్యపట్ల ఎంత అభిమానముందో, మీరు పిల్లలను చదివించుకోటానికి మీరెంత కుతూహలపడుతున్నారో నా కర్థమౌతోంది. భారతదేశంలో విద్య యొక్క విలువను గ్రహించని ప్రజలు కోట్లకొలదీ ఉన్నారు. వాళ్ళందరికీ మీ ఊరు మార్గదర్శి. ఈ పాఠశాలను ఇంత అభివృద్ధికి తీసికొచ్చిన శ్రీ వెంకట్రామయ్య గారు లేకపోవటం ఎంతో విచారకరం'... అంటూ కోటు తొలగించి ముంజేతిని చూసికొన్నాడు.

'నేను రాత్రికి మరో స్కూలు దర్శించవలసిన అవసరమున్నది కాబట్టి నేను సెలవు తీసి కొంటున్నాను. నన్ను ఈ సభకు ఆహ్వానించిన ప్రధానోపాధ్యాయులకు, కార్యనిర్వాహకవర్గానికీ—మీకూ అందరికీ నా కృతజ్ఞతాభివందనాలు చెల్లిస్తున్నాను......' వారు మరొక్కసారి 'టైం' చూసికొన్నారు. అందరితోనూ కరచాలనంచేసి సెలవు తీసికొన్నారు త్వరపడుతూ. త్వరగా అడుగు వెయ్యటంలో మైక్ వైర్' కు బూటు తగిలి మైకులు కిందపడ్డాయి. కామయ్యగారు వారితోపాటు వేదిక దిగి వెళ్లారు— సాగనంపి రావటానికి.

రెండవ ఉపన్యాసకులు 'మైక్' వద్దకు నడవటానికి సన్నాహాలు చేసుకోసాగాడు. కండువా సరిజేసుకొన్నాడు. కోటు చివరలు పట్టుకొని 'షేప్' చేసికొన్నాడు. కంఠంపై చెయ్యి వేసికొని శ్రుతి చేసుకోసాగాడు.

'మైక్' కుర్రాడు 'మైక్' దగ్గరికొచ్చి ఫూ'ఉ' అని ఊది మళ్లీ లోనికి పరుగెత్తాడు. మళ్లీ వచ్చి మైక్ పైన చిటిక వేశాడు. స్పీకర్లు మూగనోము పట్టాయి. ఐదునిముషాలు గడిచాయి. ప్రజలలో అల్లరి ప్రారంభమైంది. అధ్యక్షులవారు కూర్చోమని సైగచేస్తూ బల్లపై పొలుగుదెబ్బలు కొట్టాడు. రెండవ ఉపన్యాసకులు ఏదో మననం చేసికొంటున్నట్టు అలా స్థాణువులా నిలబడిపోయ్యారు.

'ఏం? మైకయ్యా!...తీసికెళ్లి వాగులో నూకేవాడులేక... గుంటూరునుంచ ల్లా





# సువాసన మిమ్ము ఆకర్షిస్తుంది
# రుచి సంతృప్తుల్ని చేస్తుంది-

## ఆస్వాదించండి

# బ్రూక్ బాండ్
# ఫ్రెంచ్ కాఫీ




అది పొదుపైనది
మీరు ఎక్కువ సంతృప్తిని
పొందటానికి కొద్దిగా
ఉపయోగిస్తే చాలు!



1 కిలోగ్రాము
మరియు
500 గ్రాముల
పోలిథిన్
ప్యాకెట్లులో
దొరుకును.

Bensons 2/BBC-22D TEL

# మట్టి బొమ్మలు

వచ్చావా? ఎంత దీనికి అద్దె—సలభై రూపాయలా?... తొందరగా కానియ్యి...యిట్టయితే నీవు అద్దె తీసుకొన్నట్టే...బాగు చెయ్యటం రానోడివి దీనినెంట నువ్వెందుకొచ్చావంట'.. తలగుడ్డ చుట్టుకొని శుభ్రంగా ఉతికిన తెల్లచొక్కా వేసికొన్న పెద్దమనిషి రంగస్థలంపై వాపోడు.

'కోటయ్యగారూ?...మనం అంత తొందర పడితే ఎలా?...పాపం అతనూ కష్టపడుతున్నాడుగా!... సినెళ్ళి జనాన్ని కూర్చోబెట్టు...ఈ పని నేం చూస్తాం......' కోటయ్య తీవ్ర కంఠస్వరం విని రంగస్థలం పైకి పరుగెత్తిన యువకుడన్నాడు.

'అదిగాదు పెసోడా...ఇన్ని ఊళ్ళనుండి జనమొత్తే...మనం అభాసుపాలయిపోవటంతో' ...తలపాగా ఊడదీసికొని విదిలించుకొన్నాడు.

స్పీకర్లు కీచుమన్నాయి. 'మైక్' కుర్రాడు 'హల్లో' అనటం అవతలకు స్పష్టంగా వినిపించింది. కోటయ్య ముఖం పత్తికాయలా విచ్చుకొంది. అధ్యక్షుల ముఖం నలభై కాండిల్ బల్బులా వెలిగింది. రెండవ ఉపన్యాసకులు 'మైక్' ముందు నిలబడ్డారు.

ప్రేక్షకులలో కొద్ది కొద్దిగా ప్రశాంతత నెలకొనసాగింది. వెళ్ళినవాళ్ళు వెళ్ళిపోగా ముందు కూర్చున్న పిల్లల తలలపై వలంటీర్ల కర్రలు ఆడుతున్నాయి.

'మహాశయులారా.... మీరంతా కూర్చోవాలి...నాదే చివరి ఉపన్యాసం... కూర్చోండి' ....ఉపన్యాసకుడు శ్రోతలను దీనంగా బతిమాలసాగాడు. అల్లరి తగ్గకపోయినా ఉపన్యాసం మొదలైంది.

'గౌరవ అధ్యక్షా! కమిటీ సభ్యులారా—పుర ప్రముఖులారా! విద్యార్థులారా?... మనమందరమూ ఇక్కడ ఈనాడు ఏ కారణం చేత సమావేశమయ్యామో మీకు సుపరిచితం. ఈ శుభదినం యొక్క ప్రత్యేకతను, అదే...ప్రాముఖ్యతను మీకు వివరంగా చెప్పటానికి ముందు అసలు నన్ను నేను మీకు పరిచయం చేసికోవాలి. ఎందుకంటే నేను కేవలం ఉపన్యాసకుడుగానే కాదూ నేనిక్కడుంది. హెడ్మాస్టరుగా కూడ. ఆ విషయం మరచిపోవద్దు— నెల పదిహేనో తారీఖున మీ కమిటీ కార్యదర్శిగారూ — కామయ్యగారూ— నా దగ్గరికొచ్చారు. వాళ్ళేం చెప్పారంటే 'ఈ ఏడు మా స్కూల్లో 'యస్. యస్. యల్. సీ.' పెట్టబోతున్నాం—మేము ట్రెయినింగయిన గ్రాడ్యుయేటూ, అనుభవమున్న హెడ్మాస్టరుకోసం తిరుగుతున్నామని చెప్పారు—

నిన్నటివరకూ హెడ్మాస్టరుగా ఉన్న కామయ్యగారు బి. యి. డి. కాలేదుకాబట్టి'...

ప్రజలో పెద్ద కోలాహలం చెలరేగింది. ఈలలూ—పిల్లి అరుపులు బయల్దేరాయి. ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు వాగు పారేసుకోసాగారు.

'ఎన్నడో వీడు ... గంగిరెద్దులోడులా కోటూ వీడూనూ...పోదాంపదండ్రా.'

'ఎక్కడ్నుండి పట్టుకొచ్చార్రా ... వీరకం...పోడుగాను' బెంచీని క్రిందపడేలా తన్నాడొకడు.

'కామయ్యగారికిచ్చిన దానికన్న జీతం కూడ నంద ఎక్కువేనంట. అసలు ఆ శివరామయ్య కొకర్రటీ ఏందీ...నాడెప్పుడయినా బడికిపోయ్యాడని చిన్నతనంలో'...అందరూ లేచి నిలబడ్డారు. అయినా ఆ వ్యక్తి ఉపన్యాసధోరణి మాత్రం తగ్గుముఖం పట్టలేదు.

అతని విద్యాభ్యాసం ఎలా గడిచిందీ—అతను ఓం ప్రథమంగా ఉద్యోగంలో ఎలా ఎక్కడ ప్రవేశించిందీ, ఆ తరువాత అధికారుల ఆదరణకు ఎలా పాత్రుడయ్యాడో, ఆపైన ఎలా ప్రధానోపాధ్యాయుడుగా ప్రమోషన్ పొందగలిగాడో—ఎన్నిస్కూళ్ళలో ఆ పెత్తనం చెలాయించాడో, ఎలా రిటయిరైపోయ్యాడో, ఇప్పుడు తన కూతుళ్ళూ కొడుకులూ ఎంత ఉన్నతపదవుల్లో ఉన్నారో అన్నీ ఏకధాటిగా రాళ్ళు రువ్వినట్లు, చెమటల్లు తుడుచుకొంటూ చెప్పుకుపోసాగాడు.

గద్దెమీదికొచ్చి వైగవేశాడు—ఆగమని కోటయ్య.

'ఏమిటన్నట్లు' కనుబొమలు పైకెత్తాడు ఉపన్యాసకుడు.

'ఏమీలేదండి ... సాయంత్రం జనానికి ఇక్కడే భోజనాలు ఏర్పాటుచేశామని వాళ్ళు ఊళ్ళకు పోకూడదని దండోరా వెయ్యండి... ఎందుకంటే ఇప్పటికే చాలామంది లేచి

పోయ్యారు. ఇక మిగతా వాళ్ళకూడ పోతే వండిన తిండి దండగవుద్ది ... కాస్తా ... కుస్తా ...అడపా దడపా కొన్ని మాటలు అవతల స్పీకర్లలో వినిపిస్తున్నాయి.

'అవన్నీ—తరువాత'... మళ్ళీ ఉపన్యాసం మొదలెట్టాడు.

'అయితే మీరు తొందరగా కానియ్యండి. ఏదే ఎవరికేసేతియనా చెప్పిత్తా' అని అధ్యక్షపీఠంవైపు నడిచి ముందుకు వంగి శివరామయ్యతో చిన్నగా చెప్పాడు. అతను బల్లమీదకొట్టి తగ్గించమని సైగ చేశాడు.

'కాబట్టి ఈ పాఠశాలను ఇంకెంతో అభివృద్ధిలోకి తీసికెళ్లటానికి, మీ అందరి సహాయ సహకారాలుంటేనే నేనెప్పుడూ వెనుకంజవేయను. మన కార్యదర్శి శివరామయ్య గారు—కార్యశూరులు—దీక్షా కంకణులు... వారున్నంతవరకూ మన పాఠశాలకు ఏ లోటూ ఉండదనే విశ్వాసంతో నేను విరమిస్తున్నాను.'...

ఉబ్బితబ్బిబ్బయి పోయిన శివరామయ్య మీసాలవెనుక చిరునవ్వు—పరస్పరం ఇద్దరూ అభినందించుకొంటూ చూసికొన్నారు.

'చాలా బాగుంది ... చాలా బాగుంది— మొదట మొదటగా ఇట్టా మాట్లాడితేనే గొప్పగా ఉంటుంది'...అధ్యక్షుడు అభినందించాడు. చక్కిలి గింతలుపెట్టినట్లు అతను కుర్చీలో కూర్చోలేక సతమతమై పొయ్యాడు.

'మహాశయులారా ! పొరుగూళ్లనుండి శ్రమపడివచ్చిన ప్రజలకు తమ తమ ఊళ్ళకు వెళ్లవలసిన అవసరంలేకుండా ఇక్కడ్నే భోజనాలు ఏర్పాటుచేశాం. త్వరపడి ఎవరూ వెళ్లవద్దు. భోజనాలయిపోయ్యాక రాత్రి ఎనిమిదిగంటలకు, ఇక్కడ నాటకాలూ, విచిత్రవేషాలుంటాయి' చెప్పటం ముగించి కోటయ్యకేసి చూశాడు ప్రసాద్.

'ఇంకేమీ లేదు. అదే...పోదాం పద... మనం ఆ పని చూద్దాం...ఈ మాట చెప్పటానికి ఆయన సొమ్మంతా పోయినట్టు ఉరిమి చూశాడ'న్నాడు కోటయ్య వేదిక క్రింద నిలబడి.

వేదికపై కామయ్యగారు తిరిగి ప్రత్యక్షమయ్యారు.

'మహాశయులారా! ఇంతటితో ఈ సభ సమాప్తం కాబోతున్నది. చివరిసారిగా నన్ను నాల్గుమాటలు మాట్లాడమని కొందరు మిత్రులు కోరారు. కానీ వ్యవధి లేదు. మన మందరమూ ప్రయాసపడి వెలిగించిన ఈ విజ్ఞానజ్యోతి మరింత కాంతివంతమై అజ్ఞానతిమిరాన్ని పారద్రోలాలి—అదే నా కోరిక. ఈనాటినుండి మన పాఠశాలను నిర్వహించే బాధ్యత కొత్త ప్రధానోపాధ్యాయులవారి చేతుల్లో పెడుతున్నాను. వారి అపారమైన అనుభవంతో విద్యాబుద్ధులతో, మనలను—మన పాఠశాలనూ కొత్త దారులలో నడిపిస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను. ఇప్పుడిక బహుమతుల ప్రదానం.'

సంధ్య చీకట్లు కమ్ముకోసాగాయి. పిచ్చికలు గుంపులు గుంపులుగా చెట్లపై వాలి లేచిపోతున్నాయి. రెండు పెట్రోమాక్సు దీపాలు స్టేజిపైకి తీసికొచ్చి వేలాడగట్టారు. విద్యార్థులు, అద్దాలు—సబ్బు పెట్టెలు—దువ్వెనలు మొదలైన వస్తువులు వుంచిన బల్లలు వేదికపైకి తీసికొచ్చారు.

మళ్ళీ అలజడి ప్రారంభమైంది. బహుమతులు అందుకోవలసిన విద్యార్థులు లేచి స్టేజికి దగ్గరగా నిలబడసాగారు. విజేతలను చూడటానికి, వారి వారి ప్రత్యేకతలు తెలిసికోటానికి పెద్దలు కుతూహల పడసాగారు. అన్నీ ఏర్పాటు చేయించి కామయ్యగారు కుర్చీలో కూర్చున్నారు.

ఒక ఉపాధ్యాయుడు 'లిస్టు' పరిజేసుకుంటూ మైక్ దగ్గరికొచ్చి పలికాడు.

'మొదట పాత విద్యార్థులతో, మొదలు ఆదర్శ విద్యార్థిగా ప్రథమ బహుమతి—'

'ప్రసాద్...'శివరామయ్యగారి చేతి మీదుగా బహుమతి అందుకొన్నాడు. ఆ తరువాత ఒక్కొక్కరినే పిలిచారు. నూతన భవన ప్రారంభోత్సవ సందర్భంలో నిర్వహించబడిన వ్యాసరచన వాగ్వివాద పోటీలు...ఆటల పోటీలలో గెలుపొందిన విజేతలకు బహుమతులు అందించబడ్డాయి.

'జనగణమన'తో సభ ముగిసింది.

(ఇంకా వుంది)



# వారఫలం

**9-6-1967 శుక్రవారం మొదలు**
**15-6-1967 గురువారం వరకు.**

**మేషం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృషభం:** మీకు యిష్టం లేకపోయినా, యితరుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసివస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అలంకార వస్తువులు కొంకొంటారు.

**మిథునం:** వృత్తి వ్యాపారాల్లో యిదివరక్ యేర్పడిన చికాకులు తొలగి పోతాయి. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. మిత్రుల వ్యవహారాల్లో మీ కృషి ఫలించగలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు.

**కర్కాటకం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. మీ తాలూకు వస్తువులుపోయే ప్రమాదం వుంది. వ్యాపారంలో ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు. సాటి వారలో గౌరవం బాగా ఉంటుంది. దూర ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ అధికంగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలద.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభ మూలంగా వ్యయం జరుగుతుంది.

**కన్య:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారాంతంలో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**తుల:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలించగలదు.

**వృశ్చికం:** వ్యాపారంలో ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభించ గలదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరువరకు నిలవదు. వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కొవలసి వస్తుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడము తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండకపోవచ్చును. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**మకరం:** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో ఆటంకాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**కుంభం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. సాటి వారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**మీనం:** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభించ గలవు. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

—మహేష్



నేత చీరలు కట్టుకోమని మా అత్తగారు ఒకటే పోరు - ఐనా ఎందుకో అవంటే నాకిష్టం లేదు!




'ఈ మాటైనా వేసవి సెలవులకి మా యింటికి రాపోతే, రేపొద్దున్న నీపెళ్ళికి కూడా రాను. ఇన్నాళ్ళూ ఏవో కారణాలు చెప్పి ఎగేశావు. ఈసారి ఏ కారణాలు చెప్పినా నే నొప్పుకోను!' అంది అక్కయ్య వాళ్ళూరు వెళ్ళిపోతూ. అక్కయ్య పిల్లలు — మోహన్, లలితా కూడా బాగా పేచీ పెట్టారు, 'తప్పకుండా రావిస్సి' అంటూ.

అంతవరకూ అక్కయ్యగారింటికి నేవెళ్ళడానికి ప్రత్యేకమైన కారణాలేవీ లేవుగాని, ఎందుకో నాకే వెళ్ళబుద్ధి అయ్యేదికాదు. 'అంతదూరం వెళ్తే అధమం ఓ నెల్లాళ్ళైనా వుంటేగాని రానివ్వరు. మద్రాసులో, బావ తెచ్చుకునే జీతంతో గడిపే యిల్లు కొంచెం యిరుకుగానే వుండివుండాలి. అలాంటిచోట నాకులాటిదాన్ని ఓ నెల్లాళ్ళు ఉంచుకోడం వాళ్ళకి శ్రమగానే వుంటుంది. ఏదో మాటవరసకి రమ్మంటారంతే' అని నాలో నేనే సరిపుచ్చుకునేదాన్ని.

అక్కయ్య వాళ్ళూరువెళ్ళిన మూణ్ణెల్లకిలావుంది బావనుండి ఉత్తరం వచ్చింది — అక్కయ్య గర్భవతిగా వుందని. ఆవుత్తరం వచ్చిన నెల్లాళ్ళకల్లా నా పరీక్షలవ్వడం, వేసవి సెలవులు రావడంకూడా జరగడంతో — అక్కయ్యకి కాస్త సాయంగానూ వుంటానని, ఈమారు వెళ్ళకతప్పదని అమ్మ బలవంతం చేసింది. వీలయినంత ఆలస్యంచేసి, ఇంక సెలవులయిపోతాయనే సమయంలో బయల్దేరాను.

మద్రాసు సెంట్రల్‌స్టేషన్‌లో బండి దిగాను. నన్ను రిసీవ్ చేసుకుందికి, అక్కయ్యా పిల్లలూ వచ్చారు. అక్కయ్య బాగా నీరసంగా కనిపించింది. 'బావరాలేదా!' అని అడిగాను. 'వాళ్ళూరు వాళ్ళెవళ్ళో ఏదో పెళ్ళి సందర్భంగా ఇలా చిదంబరం వెళ్ళారట. ఇవాళే వాళ్ళు వస్తున్నారక్కణ్ణుంచి. వాళ్ళని రిసీవ్ చేసుకుందికి వెళ్ళారు ఎగ్మోర్ స్టేషనుకి!' అంది అక్కయ్య.

అందరం అక్కయ్యగారిల్లు చేరుకున్నాం. నేననుకున్నంత ఇరుగ్గాలేదక్కయ్యగారిల్లు. ఒక యింట్లో పూర్తిగా కింద భాగం అంతా వీళ్ళే పుచ్చుకున్నారు. మేడ మీద మరొకళ్ళుంటున్నారు.

ఆ యింటికి చిన్న కాంపౌండు కూడా వుంది. చిన్న పెరడు దాంట్లో రెండు అరటిమొక్కలూ కూడావున్నాయి. అక్కయ్యగారిల్లు ఇంత విశాలంగా వుంటుందని తెలిస్తే నేనెప్పుడో వచ్చివుందునే అనుకున్నాను నాలో నేనే!

బావ యింటికివచ్చేసరికి మధ్యాహ్నం ఒంటిగంటయింది. ఎండలో చెమటలు గక్కుకుంటూవచ్చాడు. కుశలప్రశ్నలయాక భోజనాలదగ్గర చెప్పాడు — ఆ చిదంబరం వెళ్ళినవాళ్ళువచ్చారనీ, వాళ్ళకి కావలసిన ఏర్పాటులన్నీ చేసి, పట్టుమని ఓ గంటసేపైనా విశ్రాంతి తీసుకోకుండానే మళ్ళీ

బయల్దేరాడు, వాళ్ళకి సిటీలో ఏవైనా రెండు మూడు ముఖ్యమయినవి చూపించి, సాయంత్రానికి ఇంటికి తీసుకువస్తానని!

ఆముందురోజు రాత్రి రైలుప్రయాణం వల్ల కొంచెం అలసటగావున్న నాకు, సపాటవ్వగానే బాగా నిద్రపట్టేసింది. మెలకువ వచ్చేసరికి సాయంత్రం ఆరుగంటలయింది. అంతలా నిద్రపోయినందుకు సిగ్గుపడి, అక్కయ్యకు సారీ చెప్పుకుని త్వరగా ముస్తాబు తెముల్చుకుని, సహాయం చేద్దామని వంటింట్లోకి వెళ్ళాను. అప్పటికే వంటలో చాలాభాగం అయిపోయింది. పాపం, అక్కయ్యనిచూస్తే జాలేసింది. వచ్చేవాళ్ళు ఏకంగా ఓ ఎనమండుగురుదాకా వున్నట్టున్నారు. చాలా పెద్దవంటే తలపెట్టింది. రెండు కూరలూ; ఒక వేపడం, రెండు పచ్చళ్ళూ—వీటికితోడు రెండుస్వీటుల్లా ఒక హాటూకూడా ఉండకపోతే బాగుండదంది. ఎలాగయితేనేం, ఎనిమిది కాకుండా వంట పూర్తయింది. అక్కయ్య మాత్రం చాలా అలసిపోయింది. నామకహో నేపక్కన వున్నా నన్నమాటేగాని, నాకేమైనా చేతనయితేగా, దానికి పూర్తిగా విశ్రాంతి యివ్వడానికి!

ఎనిమిదింబావుకల్లా వాళ్ళందర్నీ తీసుకొచ్చాడు బావ. వస్తూనే, 'ఆలస్యమయిపోయింది. చప్పున వడ్డించెయ్యండి మళ్లీ సర్కారు ఎక్స్‌ప్రెస్‌కి అందుకోవాలి వీళ్ళంతా!' అంటూ హడావుడి చేశాడు. తొమ్మిదికాకుండానే అందరి భోజనాలూ అయ్యాయి. వాళ్ళకి తనుచేసిన సహాయానికి వాళ్లంతా బావను తెగపొగిడేశారు. ఉబ్బిపోయాడు బావ. మూడు టేక్సీలు తీసుకురమ్మని మోహన్‌ని పంపేడు.

వాళ్ళని స్టేషన్లో విడిచివస్తానంటూ బావకూడా బయల్దేరాడు. అలసట ఎక్కువగావున్న అక్కయ్య పాపం ఆర్రాత్రి ఏమీ తినలేకపోయింది. తిరిగి బావ వచ్చేసరికి పదకొండు గంటలయింది. ఏదో పెద్ద ఘన కార్యం చేసినవాడిలా సంతోషపడ్డాడు బావ. 'ఏమిటో ఈ అవస్థ అంతాను!' అనిపించింది నాకుమటుక్కు.

* * *

నేవెళ్ళిన వారంరోజులు తిరక్కుండానే నాపరీక్షా ఫలితాలు వచ్చాయి. ఫస్టు క్లాసులో బి. ఎస్. సి. పాసయాను. అంతతో నా చదువుకు స్వస్తి చెప్పవలసి వస్తుందని నాకూ తెలుసు. దానికి తథ్యంగా నాన్నగారినుండి వచ్చిన ఉత్తరంలో కూడా అలాగే వుంది. పెళ్లి ప్రయత్నాల్లో వున్నారనీ, మంచి సంబంధం చూసి తెలియపరిచాక నేనక్కడికి రావచ్చుననీ వ్రాశారు.

నే పరీక్ష ప్యాసయినందుకు బావ చాలా అట్టహాసం చేశాడు. వాళ్ళ ఆఫీసులో వాళ్ళందరికీ స్వీట్లు పంచిపెట్టాడు. మమ్మల్నందర్నీ సినిమాకి తీసికెళ్ళాడు. వుడ్‌లాండ్స్‌లో డిన్నర్ ఇచ్చాడు. లేదు లేదంటే నో యాభైరూపాయలు ఖర్చుపెట్టాడు. నిజానికి నా మనసు నొచ్చుకుంది. అలాని చెప్తే బావమనను నొచ్చుకుంటుంది. చెప్పకుండా వూరుకున్నాను

మోహన్ స్కూల్‌ఫైనల్‌లోకి వచ్చాడు. లలిత ఆరవతరగతిలోకి వచ్చింది. కొత్త పుస్తకాలకోసం బావని తొందరపెట్టారు వాళ్లిద్దరూ. అంత ఆడంబరంగా కనుపించే బావా, వాళ్ళకి ఫీగా ఓ యాభైరూపాయలివ్వడానికి సందేహించాడు. నా మనస్సు చివుక్కుమంది: 'ఇవాళ్టితో లెక్కల పుస్తకాలు స్టాకు అయిపోతాయట. అర్జంటుగా అయిదురూపాయలు కావాలండీ!' అంటూ బతిమాలాడు మోహన్. 'ఓరి నీ అసాధ్యం గూలా! సమంగా ఇరవయ్యేడోతారీకుని వచ్చి, 'కొంప మునిగిపోతోందండీ' అంటే డబ్బు లెక్కన్నించి వస్తాయనుకున్నావ్! ఇంకో రెండ్రోజులిదాకా నోరెత్తవద్దు!' అన్నాడు బావ. బావనెలా అర్థంచేసుకోవాలో తెలియలేదు. నేనిద్దామనుకున్నాను. కాని బావ తప్పుగా అర్థం చేసుకుంటాడని భయమేసింది.

నీరసంగా ఇంటికి వచ్చాడు మోహన్ ఒకనాడు. 'అలాగున్నావేంరా?' అని అడిగాను. మోహన్ వెంటనే ఏమీ చెప్పలేదు. కొంతసేపు తర్వాత పెరట్లోకి తీసికెళ్లి చెప్పాడు. 'లెక్కల మేష్టారు నన్ను అందర్లోనూపెట్టి తిట్టిపోశారు పిన్నీ! ఆవేళ అంతలా బతిమాలుకున్నా అయిదురూపాయలివ్వలేదు నాన్నారు.

'ఇంతవరకూ టెక్స్టుపుస్తకం లేకుండా ఎలా గడిపావని తిట్టేరు మేష్టారు. ఇప్పుడు కొందామంటే మాత్రం ఎక్కడా స్టాకులేదు. కొన్నివిషయాల్లో నాన్నగారి పనులిలాగే వుంటాయి!'

ఈ మాటలు అదోలా చెప్పాడు మోహన్! బావమీద తనకంతో కోపం ఉంటేగాని అలా చెప్పివుండడనుకున్నాను. మొట్టమొదటిసారిగా బావమీద నాకు కోపంవచ్చింది. పిల్లల విషయంలో తనంత అజాగ్రత్తగా ఉండడం ఏమీ బాగలేదని చెప్పేద్దామనుకున్నాను, ఆక్షణంలో. తరువాత కొంతసేపటికి అనిపించింది 'బావకు చెప్పడానికి నేనెవర్ని' అని.

నేనక్కడకువెళ్లిన నెల్లాళ్లలోపున వాళ్ళ సంసారంలో చాలా విషయాలర్థంచేసుకోగలిగాను. కాని మనుష్యుల్నిమాత్రం అర్థంచేసుకోడం నా తరమయ్యేదికాదు. బావ, చాలా చిత్రమైన వ్యక్తిలా కనిపించేవాడు! ఒకలా అర్థంచేసుకుందామన్న సమయంతో మరోలా ప్రవర్తించేవాడు! అలాగే అక్కయ్యనూ!!

మోహన్, లలితా, నేనూ బీచికివెళ్లి ఇంటికివచ్చాం. ఓనాడు మేమింటికి వచ్చేసరికి హాల్లో బావా, నలుగురు వ్యక్తులూ కబుర్లు చెప్పుకుంటున్నారు చాలా ధూషారుగా! వంటింట్లోకి వెళ్ళాను. కుంపటి మీద ఉప్మా అవుతోంది. స్టౌమీద పెసరట్లువేస్తోందక్కయ్య. ముఖంనిండా చెమటలుపోశాయి అక్కయ్యకి. చాలా నీరసంగా వుంది. అక్కయ్య ముఖంలోకి జాలిగా చూశాడు మోహన్. ఏమనుకున్నాడో ఏమో తెలియదు. సూటిగా అక్కయ్య నడిగేశాడు 'అస్తమానూ వచ్చేవాళ్ళేగాదుటే వీళ్ళు. ఎందుకింత శ్రమపడతావు. ఇన్ని మర్యాదలెందుకమ్మా?'

మోహన్ చాలా సమంజసంగానే అడిగాడనిపించింది నాకుకూడా! ఆవ్యక్తులు నేను వచ్చాక రెండు మూడుసార్లు వచ్చారు వాళ్లింటికి వచ్చినప్పుడల్లా ఇంతింత మర్యాదలు నిజానికి అనవసరమేనని నాకూ తోచింది.

కాని అక్కయ్యకలా తోచలేదు. 'పిల్లాడివి నీకెందుకు నాన్నా ఈ ప్రశ్నలన్నీను, వాళ్ళ అంతస్థుకు తగిన మర్యాదే మనమూ చూపించాలి. అలాటి వాళ్ళతో పరిచయం కలగడం ఎలాటి వాళ్ళకు సాధ్యం. వాళ్లు రాకుండానే చూసుకోవాలిగాని, వచ్చాక వాళ్లకు తగిన మర్యాదచెయ్యకుంటా ఎలా వుండగలం చెప్పు' అంది. నిర్ఘాంతపోయాను నేను. అక్కయ్యనలా కూర్చోమని మిగిలిన పని పూర్తిచేశాను. ఆ వచ్చినవాళ్లలో ఒకడు అరవ్వాడుట. ప్రత్యేకం అతనికోసమే ఈ పెసరట్లు వేయించాట్ట బావ. అతడు

బావను తెగమెచ్చుకున్నాడు. బావనేకాదు— ఆంధ్రదేశపు పెసరట్టుని—'ఆంధ్రాదోశై'ని మెచ్చుకున్నాడు. ఆ స్నేహితులంతా బయల్దేరేసరికి రాత్రి తొమ్మిదిన్నరయింది. అంతవరకూ ఏమీ తినకుండా ఉండడంవల్లలా వుంది అక్కయ్యకు గుండెదడవచ్చి, కొంచెం శోష తప్పిపడిపోయింది. ఈవిషయం బావకు తెలియనే తెలియదు. హుషారుగా వాళ్లతో ఇంకా కబుర్లు చెబుతూనేవున్నాడు. ఇవతల వంటింట్లో అక్కయ్య ఇలాగైతే, అవతల హాల్లో బావ అలాగ! ఎంత విరుద్ధం అనిపించింది.

కొంచెంసేపటికి అక్కయ్యకి తెలివి వచ్చింది. గేటుదాకా వాళ్లని సాగనంపి బావా వచ్చాడు. అక్కయ్య కిలా అయిందని చెప్పాను. నేననుకున్నంతగా బాధపడలేదు బావ. 'నాకోసం కూర్చోకుండా పెందరాళే భోంచేస్తూండమని ఎన్నిసార్లు చెప్పినా వింటేగా!' అంటూ విసుక్కున్నాడు ! బావ బలే వింత వ్యక్తిలాగున్నాడు అనుకున్నాను.

ఒకర్రాత్రివేళ దాహంవేసి, మెలకువ వచ్చింది. హాల్లో నిద్రపోతున్న నాకు అక్కయ్యా గదిలోనుండి ఏవో మాటలు వినిపిస్తున్నాయి. అనుకోకుండానే ఆమాటలు నాచెవిలోపడ్డాయి.

'సారీ సుశీలా! చాలా శ్రమపడ్డావివాళ. నిన్ను శ్రమపెట్టినాగాని, మాటదక్కింది. వాళ్లంతా మెచ్చుకున్నారు. రోజూ వాళ్లతో తిరిగేటప్పుడు వాళ్ళని మనింటికి ఆహ్వానించకుండా ఎలావుండగలం చెప్పు. నిన్న మేమందరం సుందరం ఇంటికెళ్లాం. ఏవో మాటల సందర్భంలో వాళ్లని మనింటికి రమ్మనక తప్పలేదు! నీవంట్లో బాగుండడంలేదని తెలిసినా వాళ్ళని తీసుకొచ్చాను!' అంటున్నాడు బావ.

'దానికేంలెండి పరవాలేదు. శరీరశ్రమకి నేనేమీ అనుకోను. కాని, ఆర్థికపరిస్థితుల గురించి మీరేమీ ఆలోచించడంలేదు. ఆ విషయంలోనే నేనేమైనా చెప్పగలనేమో! పొద్దున్న మా చెల్లి అడిగింది, పిల్లల కోసమైనా ఏ మాత్రమైనా వెనకేస్తున్నారా?' అని. ఎలా సమాధానమివ్వాలో చెప్పండి. నేనెంతచెప్పినా, ఈ విషయంలో మీరు శ్రద్ధ చేస్తున్నారు. కొంచెం జాగ్రత్తగావుంటే ఈ స్నేహితులకీ పుట్టా

# మంచివాడు

లకీ అయ్యే ఖర్చు మీరు తగ్గించగలరు!' ఇది అక్కయ్య.

'డబ్బుగురించి నువ్వేమీ బాధపడకు సుశీలా! విలువ, పొదుపు అంటూ కూర్చుంటే అసలు మనమీ వూళ్లో బతకలేం. పిల్లలు పెద్దవాళ్లయ్యాక మనపాట్లు మనకెలాగా వున్నాయ్. కాస్త స్నేహితులూ మట్టాలూ, మర్యాదలూ అవేవి ఇప్పుడే కదా సాగుతాయ్!' ఇది బావ.

బావ బలే చాదస్తుడనుకున్నాను. ఇలాంటి గడ్డుకాలంలోకూడా బావ అలా మాట్లాడ్డం నాకు చిరాకుగా తోచింది. వాళ్ల మాటలు వినకూడదనుకుంటూనే విన్నాను. అక్కయ్య మీద తనకెంతో జాలి, ప్రేమ వున్నట్టు మాట్లాడేడు బావ. దానిమీద అంత ప్రేమ, జాలి కలవాడైతే మరి దాన్నెందుకంత శ్రమ పెడతాడో అర్థంకాలేదు. బహుశా అవి, 'పడకగది ఓదార్పులేమో!' అనిపించింది వోసారి! 'పాపం, నిజంగా బావకు అక్కయ్యమీద అంత జాలి వుందేమో' అనిపించింది మరోసారి!

* * *

మోహన్‌కి నాదగ్గర చనువు ఎక్కువయింది. తన మనసులోవున్న విషయాలన్నీ దాచకుండా నాకు చెప్పేవాడు. వాడికి సమంగా పదహారేళ్లు. జీవితాన్ని బాగా అర్థం చేసుకోగల్గుతున్నాడు. వాడు నాతో మాట్లాడినప్పుడల్లా నేనొక విషయం గ్రహించగల్గేదాన్ని! తనతోటి పిల్లలంతా పొందే ఆనందాన్ని తాను పొందలేకపోతున్నందుకు బాధపడుతున్నాడు మోహన్. దానికి కారణం వాళ్ల నాన్నగారేనంటాడు మోహన్! 'తన సుఖం తన స్నేహితులూ తన గొడవలూ తప్ప అమ్మ ఆరోగ్యంగూర్చి గాని, ఇంట్లో పిల్లలగూర్చి గాని ఏమీ పట్టించుకోరు. నాన్నగారికి ఎవరు చెప్పగలరు చెప్పు పిన్నీ!' అన్నాడొకనాడు మోహన్, 'అమ్మ!— ఉత్త అమాయకురాలు! తన ఆరోగ్యం గురించి కూడా తాను నోరెత్తి నాన్నగార్ని అడగలేదు.'

మోహన్‌తో నేను పూర్తిగా ఏకీభవించవలసివచ్చింది. అన్నింటిని చాలా తేలిగ్గా తీసుకుంటున్నాడు బావ, అక్కయ్య ఆరోగ్యం రోజురోజుకూ క్షీణించిపోతున్నా లక్ష్యపెట్టులేదు బావ. ఎవళ్లనో ఒకళ్లని ఇంటికి తీసుకువచ్చేవాడు. ఆడదానికష్టం ఆమాత్రం కూడా అర్థంచేసుకోలేని బావమీద చాలా కోపంవచ్చేది నాకు. 'ఏదైనా టానిక్కులు వాడవే!' అని అక్కయ్యను బతిమాలాను. 'టానిక్కులకీ వాట్లకి మనం ఎక్కడ ఖర్చు పెట్టగలమే! నీరసం అనేది టానిక్కులతో మాత్రం తగ్గుతుందేమిటి! ముందుమాత్రం డబ్బు ఖర్చు!' అంటూ సమాధానమిచ్చిందక్కయ్య!

అక్కయ్య మరీ అంత పాతకాలపు మనిషిలా ఉండడమే బావకు లోకువయ్యిందనిపించింది.

* * *

'ఇవాళ నేనో చిన్నప్లానువేస్తాను చూడు పిన్నీ!' అన్నాడు మోహన్ ఒకనాడు స్కూలుకు వెళ్తూ! ఆ ప్లానేమిటో నేనడిగినా చెప్పలేదు. చెప్పకుండానే వెళ్లిపోయాడు.

సాయంత్రం మోహన్ ఇంటికి వచ్చేసరికి, బావా తన నలుగురు స్నేహితులూ హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. షెల్ఫులో పుస్తకాలుంచి, మోహన్ నేరుగా బావదగ్గర కెళ్లాడు. 'మా క్లాసు వాళ్లంతా ఎక్స్‌కర్షన్‌కి వెళ్తున్నాం. సాయంత్రం ఆరుగంటలలోగా ఇరవై రూపాయిలు కట్టాలి!' అంటూ చెయ్యి చూపాడు. ఒక్కక్షణం ఆలోచించి, వాళ్లందరికేసి ఓసారి చూసి, ఇరవై రూపాయిలు తీసి మోహన్ చేతిలోపెట్టాడు బావ! అలాగే తిన్నగా బయటకు వెళ్లిపోయాడు మోహన్!

వాడు తిరిగి వచ్చేసరికి ఆరున్నరయింది. బావ, స్నేహితులు బయటకు వెళ్లిపోయారు. మోహన్ చేతిలో ఓ టానిక్కు సీసావుంది! ఆశ్చర్యంగా వాడికేసి చూశాను. 'నే వేసిన ప్లాను అర్థమయిందా !' అంటూ మొదలెట్టాడు మోహన్ మొహం ఇంత చేసుకుని. 'స్నేహితులమధ్య వున్నప్పుడు నాన్నగారికి డబ్బు లెక్కఉండదు. అడగవలసిన సమయం అదేనని నాకు తెలుసు. కనక ఎక్స్‌కర్షన్‌కీ డబ్బువచ్చింది. అమ్మ టానిక్కుకీ డబ్బువచ్చింది. నా ఎక్స్‌కర్షన్‌కి పదిరూపాయలేగా!' అన్నాడు.

తల్లిమీద వాడికున్న అభిమానం చూసి ఆశ్చర్యపోయాను. అంత పెద్ద అయిడియా వాడికెలాగొచ్చిందో మోహన్ తర్వాతచెప్పాడు. బావ స్నేహితుల్లో సుందర్రావు అనే ఆయ

కీ ఈ సంసారంలో విషయాలన్నీ తెలుసుట! వాళ్ళందరితోనూ బావ, తూగలేడనీ, అస్తమానూ వాళ్ళతో తిరగవద్దనీ చాలాసార్లు బావని మందలిస్తూంటారట్ట! మోహన్‌ని కలుసుకున్నప్పుడల్లా ఇంట్లో పరిస్థితులన్నీ కనుక్కుని బాధపడతారట్ట! ఈ అయిడియా కూడా ఆయనే మోహన్‌కి చెప్పారుట!

బావ పరిస్థితి, బావ స్నేహితుల పరిస్థితీ అంతా అయోమయంగా కనిపించింది నాకు. చెడ్డగా అర్థంచేసుకుందామంటే మంచిగా కనిపిస్తారు. మంచివాళ్ళనుకుందామంటే వాళ్ళుచేసే పన్లు చెడ్డవిగా కనిపిస్తూంటాయి.

నేనక్కడికెళ్ళి నెలాపదిహేను రోజులవుతోంది. రోజురోజుకూ వాళ్ళింట్లో పరిస్థితులు నాకేమీ నచ్చకుండా వున్నాయి. వారానికి నాలుగురోజులు ఎవళ్ళో అతిథుల్ని తీసుకువస్తాడు బావ. అందరిచేతా మంచి వాడనిపించుకుంటాడు—అక్కయ్య ఆరోగ్యాన్ని వెచ్చించి! రోడ్డమ్మట పోతోంటే తగిలే చుట్టాలు కొంతమంది. ఆఫీసుకు వచ్చి కలుసుకునే పక్కాలు కొంతమంది; ఈ వూరివాళ్ళు కొంతమంది; ఆవూరు వాళ్ళు కొంతమంది; మరోవూరు వెళ్తూ దార్లో ఆగి బావను కలుసుకుందామని వచ్చినవాళ్ళు కొంతమంది. ఎలాగయితేనేం, వీళ్ళందరూ అక్కయ్యపాలిటి యములాళ్ళలా కనిపించేవారు నాకుమటుకు!

# మంచివాడు

తిరిగి నేను మావూరు వచ్చేలోగా బావ కెలాగైనా గుణపాఠం నేర్పాలని తహతహ లాడాను. 'గుణపాఠం నేర్చుకున్నా బావలో ఇంక మార్పు వస్తుందా ఏమిటి' అనిపించింది. అయినా ధైర్యం తెచ్చుకొని ఒక నాడు నా మనసులో వున్న విషయాల్ని బావకి చెప్పేశాను—స్నేహితులనీ, చుట్టాలనీ తానంత విచ్చలవిడిగా తీసుకురాకూడదని! బావ జాలిగా సమాధానమిచ్చాడు! అందరితోనూ తిరగడం, మాటవరసకి వాళ్ళని ఆహ్వానించడం తనలోని నిర్బలత అని చెప్పాడు. బావ నిజానికి చాలా మంచి వాడు. ఏ కపటం లేనివాడే! తనలోని కొన్ని బలహీనతలవల్ల, భార్యను పిల్లల్ని అంతకంటె బాగా చూసుకోలేకపోతున్నాడు. పైవూరువాళ్ళమాట ఎలాగున్నా ఆ వూరి స్నేహితులతోనైనా బావకి విరోధంవస్తే, బావ సంసారం చాలావరకు బాగుపడుతుం దనిపించింది నాకు. మోహన్‌కి కూడా అలాగే తోచింది.

* * *

ఆ రోజున అక్కపరిస్థితి మరీ దారుణంగావుంది. ఆ రోజునే బావకూడా, తన స్నేహితులని తీసుకువచ్చాడు. ఎలాగో ఓపిక తెచ్చుకొని అక్కయ్య వంటింట్లోకివెళ్ళింది. నా సహాయంతో టిఫిను చేస్తోంది. కాఫీ కలుపుదామని వేన్నీళ్ళు తీయబోతూ నీరసంగావుండడంవల్ల కాలుమీద వొలేసుకుంది పొరపాటున. 'అమ్మా!' అనుకుంటూ క్రింద చతికిలబడింది. అదేసమయానికి మోహన్ వచ్చాడు స్కూలునుంచి. వస్తూనే చికాకుగా కనిపించినవాడు ఈ సంఘటన చూసి, తట్టుకోలేకపోయాడు. బావమీద వాడికున్న కోపం అంతా వెలియబరుద్దామని నాతో ఏదో అనబోయాడు వంటింట్లో. అక్కయ్య వాడి నోరు నొక్కేసింది!

ఇంతలో బావ వాణ్ణి పిలిచాడు. మోహన్ వెళ్ళాడు. సిగరెట్లు తెమ్మని డబ్బులిచ్చాడు బావ. మోహన్ తెచ్చియిచ్చాడు. చక్కపొడి తెమ్మని మళ్ళీ పంపించాడు బావ. అదీ తెచ్చాడు మోహన్. పొట్లాలు బావచేతిలో వుంచుతూ, 'ఇవాళ క్రొత్త డిక్షనరీలు వచ్చాయ్. నన్నూ ఒకటి కొనుక్కోమన్నారు మేస్టారు. పదిరూపాయలు కావాలి!' అన్నాడు.

బావ చాలా తేలిగ్గా సమాధానమిచ్చేశాడు 'పోవోయ్! ఇంట్లో ఉన్నదొకటి ఉపయోగించడం తెలుస్తేనా, కొత్తదానికోసం పరుగెట్టొచ్చు. అయినా, నీకేమైనా తెలియకపోతే నన్నడుగు చెప్తాను. డిక్షనరీ ఎందుకు?'

'ఇంట్లో ఉన్నది బాగా చిరిగిపోయింది, పాతదయిపోయింది. చాలా పేజీలుపోయాయి. కొత్తదికావాలి!' అన్నాడు మోహన్ రోషంగా!

'ఇప్పుడు కాదుపోవోయ్! తరవాత చూద్దాంలే?' బావ తేలిగ్గా సమాధానం చెప్పాడు.

'సిగరెట్లూ, చెక్కపొట్లాలూ ఇప్పుడు కాదని చెప్పవలసింది, నేమామ. వీటన్నిటికీ డబ్బులొస్తాయికాని, నా పుస్తకాలకిమాత్రం రావు.' ఈ మాటలు మోహన్ అంటున్నా డని తెలిసి అక్కయ్యా, నేనూ ఆశ్చర్యంగా అటువైపు విన్నాము.

మోహన్ అంతతో ఆగలేదు—'ఒక్కసారి వంటింట్లోకివచ్చి చూడండి, అమ్మ పరిస్థితి ఎలాగుందో! మీరూ మీ స్నేహితులూ కులాసాగా వుంటే సరిపోతుందనుకున్నట్టున్నారు!' అనేశాడు, ఆ ఆవేశంలో! వంటింట్లోంచి బయటకువచ్చి, హాల్లోకి చూశాను. గోడకు ఆనుకుని మోహన్ వెక్కి వెక్కి ఏడ్చేస్తున్నాడు. అందరూ తెల్లబోయి, ఒకరి మొహాలొకళ్ళు చూసుకుంటున్నారు,



బావకు బలేకోపం వచ్చింది. మోహన్‌కి రెండు తగల్నిద్దామని వెళ్లిన బావను వారించారు సుందర్రావుగారు. 'ఏవిటిది పిల్లాడి మీద చెయ్యిచేసుకుంటావ్, నీకేమైనా మతి పోయిందేమిటి?' అంటూ బావను యధాస్థానంలో కూర్చోబెట్టారు. మిత్రులివైపు చూసి, గొంతు సవరించుకున్నారు.

'మన రంగనాధానికి ఈ విషయం ఎన్నో సార్లు చెప్పిచూశాను. తగని ఆడంబరం కోసం చూసుకుంటున్నాడనీ, ఇంట్లో వ్యవహారాలని ఏమాత్రం లక్ష్యపెట్టడం లేదనీ నాకు తెలుసు. ఎందుకింత యాతనపడాలో అర్ధంకాకుండా వుంది. రేపు రంగనాధానికేదైనా నష్టంవస్తే, ఆబాధంతా మనకే! భార్యాపిల్లలు గలవాడు భవిష్యత్తు గూర్చి కొంచెం ఆలోచించుకోపోతే ఎలా? కృష్ణారావుగారు చెప్తేగాని రంగనాధం శ్రద్ధ వహించడులాగుంది!' అంటూ కృష్ణారావు గారివైపు చూశారు. అక్కడున్న అందర్లోనూ, స్తోమత, పలుకుబడి విషయాల్లో ఆయనే గొప్పవారు! ఆయనమాట బావ తప్పక పాటించి తీరుతారు!

'ఇంతవరకూ నాకీవిషయం తెలిసిందే కాదు! మాదగ్గర నీకింత మొహమాటమేమిటి రంగనాధం? జరిగిందాన్ని తేలిగ్గా తీస్కో! ముందు ఆవిడ ఆరోగ్యం చూసుకో! ఇప్పుడే మా డాక్టరుగారికి ఫోన్‌చేస్తా! ఆవిణ్ని తీసికెళ్లి చూపించు!' అన్నారు కృష్ణారావుగారు.

నిలువునా నీరయిపోయాడు; పాపం, బావ! మరేమీ మాట్లాడలేక అలానే కూర్చున్నాడు నీరసంగా!

'ముందావిడసంగతి చూడు. తరువాత వచ్చి కలుసుకుంటాంలే!' అంటూ బయటకు దారితీశారు కృష్ణారావుగారు. మిగిలిన ముగ్గురూ ఆయన్ననుసరించారు.

మరికొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి! మోహన్‌ని బావ ఏంచేసేస్తాడోనని భయపడిపోయాం, నేనూ అక్కయ్యా! కొంతసేపటికి బావ అక్కణ్నించి లేచి, తిన్నగా అక్కయ్య దగ్గరకొచ్చాడు. బావ ముఖం కోపంగాలేదని చూసి, సంబరపడ్డాను. బావ జరిగిందాన్నంతటినీ నిజంగానే తేలిగ్గా తీసుకున్నాడు. అందర్నీ ఏమంగా అర్ధంచేసుకున్నాడు.

'ఇన్నాళ్లూ నాలోవున్న పిరవం ఇక మీద వుండదు. నువ్వింత బాధపడుతున్నావని గుర్తించలేకపోయాను! మోహన్ నాకు బాగానే పాఠం చెప్పాడు. డాక్టర్ దగ్గరకెళ్దాం బట్టలు మార్చుకో!' అన్నాడు బావ.

చాలా మెంటిగా! బావలో 'అంత మార్పువచ్చినందుకు అప్రయత్నంగా నా కళ్లనుండి రెండు ఆనందభాష్పాలు రాలాయి!! ●

# కొవ్వొత్తులు



(క) కొవ్వొత్తులు:

ఢిల్లీలో తరుచు జరుగుతున్నట్లే ఒక రాత్రివేళ ఎలక్ట్రిసిటీ హఠాత్తుగా బందు అయిపోయింది. ఇల్లా జరుగుతూ ఉండడం మామూలే కనుక ముందుగానే కొవ్వొత్తులుకొని ఉంచుకున్నాం. రెండు కొత్త కొవ్వొత్తులు తీసి వెలిగించాం. వాటిలో ఒకటి రెండో దానికన్న కాస్త లావు. పొడుగు మాత్రం సమానమే. సన్నటిది 4 గంటల లోనూ, లావుది 5 గంటలలోనూ పూర్తిగా కాలిపోతాయి.

కొంతసేపు అయాక మళ్ళీ ఎలక్ట్రిసిటీ వచ్చింది. కొవ్వొత్తులు ఆర్పేశాం. కాలగా మిగిలిన కొవ్వొత్తి ముక్కలుచూస్తే ఒకటి రెండో దానికన్న 4 రెట్లు పొడుగ్గా ఉంది

ఇంతకీ ఆ కొవ్వొత్తులు ఎంతసేపు వెలిగాయి అన్నమాట?

* * *

# ముక్కాలిపీట



(చ) ముక్కాలిపీట :

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

నాలుగుకాళ్ళున్న పీటలు ఒక్కొక్కప్పుడు నేలమీద సరిగ్గా ఆనక టకటక లాడుతూ కదులుతాయికదా, ముక్కాలిపీటలు ఈ విధంగా కదలకుండా స్థిరంగా ఎందుకుంటాయి ?

* * *

# కుంజర యుద్ధం



(ట) కుంజరయుద్ధం :




ఇదొక కొత్తరకం ఆట. దీనికి రెండు చింతగింజలు, రెండు గులకరాళ్ళు—లేదా చదరంగంలోని రెండు తెల్ల ఏనుగులు, రెండు నల్ల ఏనుగులు —అవసరం.

రెండు నల్ల ఏనుగులను 1, 2 అని వ్రాసిఉన్న సున్నలలోనూ, రెండు తెల్ల ఏనుగులను 9, 10 అని వ్రాసిఉన్న సున్నలలోనూ ఉంచు. నల్ల ఏనుగునుగాని, తెల్ల ఏనుగునుగాని తోచిన క్రమంలో కదుపవచ్చు. ఏనుగు ఒకసున్నలో బయలుదేరి, గీతవెంబడి తిన్నగావెళ్ళి, ఆ వరుసలో ఏ సున్నలోనైనా ఆగవచ్చు. ఒక ముఖ్య విషయం గుర్తుంచుకోవాలి. నల్లఏనుగు ఉన్న గీతమీద తెల్ల ఏనుగు నిలబడకూడదు. అల్లాగే తెల్లఏనుగు నిలిచిన గీతమీద నల్లఏనుగు ఉండకూడదు. చదరంగంలో ఏనుగులలాగే ఇక్కడకూడ ఈ ఏనుగులు తాము ఉన్న లైను కాపలాకాస్తూ ఎదిరిపక్షాన్ని ఆ గీతమీద నిలువకుండా చేస్తాయి. ఈ నియమాలకు లోబడి కాయలను కదుపుతూ నలుపు ఏనుగులను 9, 10 సున్నలలోకి, తెలుపు ఏనుగులను 1, 2 సున్నలలోకి తీసుకురావాలి. ఈపనిని సాధ్యమైనన్ని తక్కువ ఎత్తులలో సాధించాలి. చూడడానికి ఇది చాలా సులభం అనిపిస్తుంది. కాని, మొదలుపెడితే ఇబ్బందులు ఎదురు అవుతాయి. ఒక ఉదాహరణ ఇస్తే ఈ ఏనుగుల నడక సులభంగా అర్థం అవుతుంది. నల్ల ఏనుగులను 1 నుంచి 3 కి గాని, 2 నుంచి 3కి గాని కదపడం మాత్రమే సాధ్యం. మిగిలిన గదులన్నింటినీ తెల్ల ఏనుగులు కాస్తున్నాయి. అల్లాగే తెల్ల ఏనుగులను 9 నుంచి 7కి గాని, 10 నుంచి 7కి గాని కదపవచ్చు. ఇంక మొదలుపెట్టండి.

జవాబులు

(క) కొవ్వొత్తులు 3¾ గంటలసేపు వెలి



గేయి అనుకో. 4 గంటలలో పూర్తిగా కాలిపోయే సన్నటి కొవ్వొత్తి $x$ గం. లలో $\frac{x}{4}$ భాగం కాలుతుంది. $(1-\frac{x}{4})$ భాగం మిగిలిపోతుంది. అల్లాగే లావు కొవ్వొత్తిలో $(1-\frac{x}{5})$ భాగం మిగిలిపోతుంది. మిగిలిపోయిన భాగాలు 1:4 నిష్పత్తిలో ఉన్నాయి కనుక

$$\left(1-\frac{x}{4}\right) : \left(1-\frac{x}{5}\right) = 1 : 4$$

ఈ సమీకరణాన్ని సాధిస్తే $x=3\frac{3}{4}$ గంటలు అని సమాధానం వస్తుంది.

అంటే విద్యుత్తు $3\frac{3}{4}$ గంటలసేపు ఆగిపోయింది అన్నమాట!

(చ) నాలుగు కాళ్లపీటకు కాళ్ల చివరి బిందువులు నాలుగూ ఒకే సమతలంలో ఉన్నట్లయితే గతుకులులేని నున్నని నేలమీద స్థిరంగా ఉంటుంది. పీటకు 4గాని, 5 గాని 6గాని......ఎన్ని కాళ్లున్నా ఈ సిద్ధాంతం వర్తిస్తుంది. కాని సాధారణంగా కాళ్ల పొడవులు సమానంగా ఉండక పోవడంగాని, నేల ఒకే సమతలం లేకపోవడంగాని కారణంగా పీటస్థిరంగా ఉండక కదులుతుంది.

ఇదే ముక్కాలిపీట విషయంలో అయితే కాళ్లపొడవులు హెచ్చుతగ్గుగా ఉన్నా, నేల గతుకులుగాఉన్నా పీట స్థిరత్వానికి లోపం ఏర్పడరాదు. ఏమంటే, ఏ మూడు బిందువులు ఇచ్చినా వాటిగుండా సమతలం గీయవచ్చు. బిందువులు 3కన్న ఎక్కువ అయితే వాటి అన్నిటిగుండా సమతలం గీయడం ఎల్లప్పుడు సాధ్యంకాదు. కనుక పీటకు 3 కాళ్లుఉంటే ఉన్న స్థిరత్వం అంతకన్న ఎక్కువ కాళ్లుంటే రాదు.

ఈ కారణంచేతనే ఫొటోగ్రాఫర్లు తమ కెమెరాలను నిలుపబెట్టడానికి మూడు కాళ్లుండే స్టాండును ఉపయోగిస్తారు. నాలుగో కాలుపెడితే అధికప్రయోజనం లేకపోగా ఇబ్బందికూడాను.

(ట) దీనిని 18 ఎత్తులలో ఈ క్రింది విధంగా సాధించవచ్చు.

2—3, 9—4, 10—7, 3—8, 4—2, 7—5, 8—6, 5—10, 6—9, 2—5, 1—6, 6—4, 5—3, 10—8, 4—7, 3—2, 8—1, 7—10.

మీరు కేంద్ర ఆహారశాఖామంత్రి అయితే మొదట మీరు చేసే మార్పేమిటండి?

వై. సుంధర, కర్నూలు.




**ఆహారం ఎక్కువగా తినే వాళ్ళకు, మితంగా వుండాలని నోటీస్ యివ్వడమే!**

మీరు నటునిగా రాణించడానికి ఎక్కువ శ్రమ పడ్డారా—లేక నిర్మాతగానా?

జి. వెంకట రామారావు, దోమకొండ

**నటుడిగా రాణించడానికే ఎక్కువ శ్రమపడ్డాను, పడ్తున్నాను, పడబోతున్నాను.**

మానవజీవితం ఎందుకు?

కె. లక్ష్మయ్య డి.యన్.కె. ప్రాజెక్ట్ (జగదల్‌పూర్)

**మీ ప్రశ్నలోనే వుంది సమాధానం! ఎందుకు?**

మీరు నవ్వుతూ పుట్టారా? ఏడుస్తూ పుట్టారా?

గంగారాం, హైదరాబాద్.

**చంటిగుడ్డును నాకేం తెలుస్తుంది. పుట్టిన తర్వాత ఏడ్చాను.**

నాటినుండి నేటిదాకా యిక ఎప్పటికీ మమ్మల్ని నవ్వించే మీ నటన 'ఫార్ములా' ఏమిటో కాస్త చెప్తారూ?

జె. కృష్ణానంద్, కర్నూలు.

**సహజత్వం, సభ్యత కలసి వుండటమే!**

ఈ కలియుగంలో మీకు యిష్టంకానిది ఏది?

హృదయనాథ్, కరీంనగర్.

**అహంభావంగా తిరగడం, పొగిడించుకోవడం, కాకా పట్టడం.**

హృదయంలో దాగనిది ఏమిటి?

కె. పుష్పలత, సాలూరుకాంప్.




**చేసిన పాపం!**

అసలు మీ జీవితాశయం ఏమిటి?

వి. వి. హనుమాన్, మంగళగిరి.

**ఉన్న దానితో తృప్తిపడి, మంచిని పెంచుకోవడమే!**

ఏ చిత్రంలోను చివరకు హాస్యనటుడు చనిపోయినట్లు చూపలేదు. ఎందుచేతనంటారు?

యస్. నజీర్, వాల్తేరు.

**ఛార్లీ చాప్లిన్ ఒక చిత్రంలోను, రేలంగి-దొంగరాముడులో!**

కన్నుమూయగా కనిపించే అంధకారము ఏమి చూస్తుంది?

కె. కోటేశ్వరరావు, పాలకొండ.




**ఊహా ప్రపంచాన్ని.**

మన చిత్రాలలో హీరోయిన్‌నే సెక్సీగా చూపిస్తారు. మరి హీరోను చూపించరేం సార్?

కె. వి. వి. బ్రహ్మానందరావు, ధవళేశ్వరం.

**ఈ ప్రశ్న హీరోనే అడగండి.**

తెరమీదనే మిమ్మల్ని, మీ నటనని చూస్తుంటే నవ్వు వస్తుంది. ఒకవేళ మద్రాసువచ్చి మిమ్మల్ని కలుసుకొంటే.......?

టి. రాజవల్లభాయ్, ముఖ్‌పాల్.

**తప్పకుండా వచ్చి కలసికోండి! ఒక్క జోక్ చెప్తానంటే పకపక యికిలిస్తారు.**

ఇది సినిమాతారల పెళ్లిళ్ల సీజన్‌లా ఉందంటాము. మరి మీరేమంటారు?

పి. సువర్ణకుమారి, విశాఖపట్నం.

**ఔను పెళ్ళి భోజనాలు బ్రహ్మాండంగా తింటున్నాము.**

భగవంతుడు యీ ప్రపంచాన్నంతటినీ బొమ్మలాటవలె ఆడిస్తున్నాడుకదా! మరి యీ ఆటను ఆపే దెప్పుడు?

టి. రవీంద్రనాథ్ దాస్, హైదరాబాద్.

**ఇప్పుడు బహుశా యింటర్‌వెల్ వరకు వచ్చిందనుకుంటా! యిక దానినిబట్టి ఊహించండి.**

మీరు తీస్తున్న చిత్రానికి 'శ్రీ మర్యాదరామన్న' కాక, 'శ్రీ శ్రీ శ్రీ మర్యాద రామన్న' అని ఎందుకు పేరు పెట్టవలసి వచ్చింది?

ఎం. వి. యస్. హనుమంతరావు, మచిలీపట్నం.

**మూడు 'శ్రీ'లలోని అర్థం - "సరస్వతి, లక్ష్మి, పార్వతి."**

తెలుగుసినిమాలను అరవంలోకి, అరవ సినిమాలను తెలుగులోకి, హిందీ సినిమాలను తెలుగులోకి తెలుగు సినిమాలను హిందీలోకి మాటలు మాత్రం మార్చి డబ్ చేస్తున్నారుకదా! మరి వాంఛి (కథ, ట్రీట్మెంట్, హాస్యంగల) ఇంగ్లీషు చిత్రాన్ని తెలుగులో



డబ్ చేయడంలేదు, ఎందుకూ?

కె. మురళీబాబు, ఏలూరు.

**డబ్ చెయ్యొచ్చు, కాని మన సాంప్రదాయానికి తగినట్టుగా, మన సెన్సార్ వాళ్లు సెన్సార్ చేస్తే మనం చూసేది, మొదటి టైటిల్స్, మధ్య 'ఇంటర్ వెల్', చివరి 'ది ఎండ్' మాత్రమే! తర్వాత 'జనగణమన' మాత్రం వుంటుంది.**

రూపాయి విలువలో తగ్గింపుకు, వరకట్నంరేటు పెరగటానికీ కారణం ఏమిటి?

అన్వర్ బాషా, బళ్లారి.




**వరకట్నం పిశాచం కూడా ఒక వ్యాపారమే! సమయానుకూలంగా రేట్లు హెచ్చింపబడును.**

ప్రతిచిత్రంలో సామాన్యంగా హాస్యనటుడు హీరోపక్షమే ఉంటాడు. కాని, విలన్‌పక్షము మాత్రం ఉండడు. ఎందుకు?

పి. ఆంజనేయులు, ముషీరాబాద్.

**ఏమండీ మీరు ఆంధ్రపత్రికలు చదవడం లేదనుకుంటా! ఈ ప్రశ్నకు జవాబు యిదివరకు పత్రికలలోనే వుంది, కావలసివస్తే ఒకసారి తిరగెయ్యండి.**

చచ్చేటపుడు వెంట ఏమీ తీసుకెళ్లమని అందరికీ తెలుసు. కానీ, బ్రతికి నన్నాళ్లు డబ్బుకోసం యింత తాపత్రయం ఎందుకండీ?

పి. లక్ష్మీ, రాజమండ్రి.

**"ఆశతోనే లోకమంతా బ్రతుకుతుందిరా!**

**అందులోనే కథ అంతా యిమిడి వుందిరా"**

దేవదాసు, పిన్ని మున్నగు చిత్రాలలో భార్య పోయిన వ్యక్తికి పడుచు యువతితో వివాహం చేస్తారు. కాని, భర్తపోయిన స్త్రీకి పడుచు యువకుని వివాహం చేయరు, ఎందుకు?

యాస్మిన్, ఆకీవీడు.

**మనం చేద్దామన్నా భారతస్త్రీ ఒప్పుకోదు. మనస్సు ఒక్కడికే అంకితంచేసి ఐక్యమయిపోతుంది. అందువల్ల అటువంటి చిత్రాలు తియడానికి సాహసించరు.**

మీరు ఏ చిత్రంలో అయినా విలన్‌గా నటించారా?

కె. జగన్నాథం, ములుగు

**మెల్లగా అడగండి, రాజనాల వింటాడు. యిప్! కార్యవరాయని కథ, చదువుకున్న అమ్మాయిలు.**

భర్తే, భార్యకు తాళి ఎందుకు కట్టాలి?

పద్మాచంద్, విశాఖపట్నం—2.

**మీసమున్న మొగవాడై భరించేవాడు గనక!**

మీ మాటలు, నటన, మాకు నవ్వు నిస్తాయి. మరి మానవ్వు మీకేమి యిస్తుంది?

వడ్డాది సత్యలావణ్య కుసుమజ్యోత్స్న ప్రసూన చంద్రకళా ప్రభావతీ సూర్యకుమారి, భిలాయ్‌నగర్.

**మీ ప్రశ్నమాట దేవుడెరుగు దీనికి సమాధానం చెప్పండి. యింత**

### బహుమతిపొందిన ప్రశ్న

మీరు 'ఎందుకు?' అనే సినిమా ఎందుకు తియ్యరాదుసార్?

బి. కృష్ణమూర్తి, ములకలచెర్వు.




**తీరా తీసిన తర్వాత ప్రేక్షకులు యీ సినిమాను 'ఎందుకు?' చూడ్డం అని అంటే నావని గోవిందే!**

**వాడుకుపేరు మీ ఒక్కరిదేనా? లేక ఎనిమిది అమ్మాయిలు కలిసి ఒకే ప్రశ్న పంపించారా?**

పావలా, అర్ధరూపాయి నాణేల ప్రకారం— రూపాయి నోట్లు కూడ రవుండ్‌షేప్‌లో ఎందుకు ఉండకూడదు?

పి. హెచ్. రాజా, బరంపురం.




**ఆ బాపతు సీసీ నోట్ల స్టాక్ మీ దగ్గర ఏమన్నా వుందా? ●**

# చంద్రమోహన్



ముఖ్యమంత్రి యింట్లో విందు సందర్భంలో.

రంగుల రాట్నం చిత్రంద్వారా ప్రేక్షకులకు పరిచితుడయి విశేష ప్రశంస అందుకొన్న చంద్రమోహన్‌కి అంతకు పూర్వం ఏమాత్రం కూడా నాటకరంగానుభవం లేదంటే ఆ చిత్రం చూసిన వాళ్లకి ఆశ్చర్యం కలుగ జేయక మానదు. రంగస్థలానుభవం లేకుండా, నటించిన మొదటి చిత్రంలోనే మంచిపేరు తెచ్చుకున్న యీ కొత్త నటుడు చంద్రమోహన్‌కి పరిశ్రమలో నేడు చక్కని భవిష్యత్తు కనిపిస్తున్నది.

23 మే 1943 లో విజయవాడకి 20 మైళ్లదూరానగల పమిడి ముక్కలలో జన్మించాడు చంద్రమోహన్. మేడూరులో హైస్కూలు విద్య పూర్తిచేసిన తర్వాత బందరు హిందూకాలేజీలో పి. యు. సి. లో చేరాడు. అందులో క్లాసువచ్చింది. మెడిసన్‌కి సీటుకోసం ప్రయత్నిస్తే రాలేదు. వెయిటింగ్ లిస్టులో వేశారు. ఖాళీగా ఉండడం ఎందుకని అగ్రికల్చర్ . బియస్. సి. చదివాడు. 1964లో బి. యస్. సి. (ఎ. జి.) డిగ్రీ తీసుకున్నాడు. ఆ సంవత్సరమే అతని తండ్రి చనిపోయారు. ఏలూరులో అగ్రికల్చర్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరుగా ఉద్యోగంలో చేరాడు అప్పుడే.

చంద్రమోహన్ బావ వీరభద్రరావుగారు మంచి స్టేజి ఆర్టిస్టు. కీలుబొమ్మలు విడుదల సందర్భంలో 1965 లో ఒక రోజు సుప్రసిద్ధ నటుడు శ్రీ ముదిగొండ లింగమూర్తి విజయవాడ వచ్చారు. వచ్చే ముందు ఆయనతో దర్శకనిర్మాత శ్రీ బి. యన్. రెడ్డి—మంచి ఆర్టిస్టులు కుర్రవాళ్లను చూసి స్టిల్స్ తీసుకురమ్మని చెప్పారుట! వీరభద్రరావుగారికి లింగమూర్తిగారికి వున్న స్నేహాన్ని పురస్కరించుకొని ఆయన వారింటికీ వెళ్లారు. లింగమూర్తిగారి దృష్టి చంద్రమోహన్‌పై పడ్డది. 'అబ్బాయ్, నువ్వు సినిమాల్లో ఎందుకు నటించకూడదూ!' అంటూ ఉత్సాహపరిచి ఫోటోలు తీసుకువెళ్లారు, మద్రాసు.

ఇది జరిగిన రెండుమాసాల అనంతరం స్క్రీన్ టెస్టుకు రావలసిందిగా చంద్రమోహన్‌కి వాహిని సంస్థనుంచి పిలుపు వచ్చింది. 29 నవంబరు 65 న మద్రాసు వచ్చాడు. ఆరోజానే మూడు గంటలపాటు స్క్రీన్ టెస్టు చేశారు బి. యన్. ఈ నవయువకునిలోని ఉత్సాహం, సంభాషణలు చెప్పే తీరు బి. యన్. ని ఆకర్షించినవి. అవకాశం యిస్తే అభివృద్ధిలోకి వస్తాడని తలిచారు. అతన్ని ఆశీర్వదించి 'రంగుల రాట్నం'లో వేషం యిచ్చి, ప్రోత్సహించారు.



చంద్రమోహన్.

అలా తొలిచిత్రం రంగులరాట్నంలో తన ప్రతిభను నిరూపించుకొన్న చంద్రమోహన్ ప్రస్తుతం—శ్రీ ప్రొడక్షన్స్‌వారి కొత్త సాంఘికం, ఎం. వి. ఆర్. పిక్చర్స్, శ్రీదేవి ప్రొడక్షన్స్, ఆలయ ఫిలిమ్స్‌వారి 'పల్లెసీమ' చిత్రాలలో నటిస్తున్నాడు. ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన ప్రభుత్వ ఫిలిమ్ అవార్డుల ఉత్సవంలో పాల్గొని మొమెంటో తీసుకున్నాడు.

'నాకు యింతటి అవకాశం కల్పించి, నటనలో లోటుపాట్లు విప్పిచెబుతూ నాపట్ల ఎంతో శ్రద్ధా, శ్రమా తీసుకొన్న శ్రీ బి. యన్. రెడ్డిగారికి నేనెంతో ఋణపడి వున్నాను' అంటాడు చంద్రమోహన్.

గాత్రం పాడటంలోను, ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్‌లోను చంద్రమోహన్‌కి ప్రవేశం వుంది. సరదావుంది. స్పోర్ట్సు అంటే కూడా అతనికి మక్కువ ఎక్కువ. ఒకప్పుడు అతను మంచి స్పోర్ట్సుమన్. చదువుతోపాటు చక్కని సంస్కారమూ వుంది చంద్రమోహన్‌లో. మనసిచ్చి మాట్లాడుతాడు. తీరికవేళల్లో పుస్తకాలు చదువుకోవటం, స్నేహితులతో కబుర్లు చెప్పుకోవటం, నటనలో కొత్త సంగతులు తెలుసుకోవటం లేదా పాడుకోవటం చంద్రమోహన్ సరదాలు.

శ్రీ ప్రొడక్షన్స్ వారి కొత్తచిత్రంలో చంద్రమోహన్ ఒక కొత్తతరహా భూమిక ధరించాడు. ఆ పాత్ర అతని భవిష్యత్తుకి బంగారుబాట వేరుస్తుందనటంలో అత్యుక్తి ఉండదు.

—మోహన్‌కుమార్

# చిత్రలహరి

శ్రీ దేవీ ప్రొడక్షన్స్‌వారు తమ మూడవ ప్రయత్నంగా యీసారి ఒక సాంఘిక చిత్రం నిర్మించే సన్నాహాలలో వున్నారు. మరాఠీలో నిర్మించబడి, పూనాలో 52 వారాలపాటు నడచిన 'శాంతి ఐకు' ఆధారంగా యీ చిత్ర నిర్మాణం జరుగుతుంది. ఆ చిత్రపు హక్కులను కొన్నారు. ప్రస్తుతం స్క్రిప్టు జరుగుతున్నది. ఇందులో ముఖ్య భూమికలను పోషించేందుకు యింతవరకు చంద్రమోహన్, జయకృష్ణ, కాకరాల, బి. వి. రాధ, విజయలలిత ఎన్నుకోబడినారు. జూలై నుంచి సెట్స్‌కు వెళ్లే యీ చిత్రానికి సి. పుల్లయ్య దర్శకత్వం వహించగలరని అనుకుంటున్నారు. ఒకవేళ పుల్లయ్యగారు విశ్రాంతి తీసుకునే పక్షంలో వేరొకరు నియమింప బడగలరని యీ చిత్ర నిర్మాత శ్రీ తోట సుబ్బారావు చెప్పారు. సంగీతం: ఘంటసాల, కెమెరా: సి. నాగేశ్వరరావు నిర్వహిస్తారు.

— మోహన్‌కుమార్ ●

## అవీ - యివీ...

### యోగాసన ప్రదర్శనలు

ఇటీవల మద్రాసులో త్యాగరాయనగర్‌లోని హబీబుల్లా రోడ్డులోవున్న రామారావు కళా మంటపంలో పెదవాల్తేరు, యోగాశ్రమ వాస్తవ్యులు—శ్రీ సచ్చిదానందస్వామి యోగాసన ప్రదర్శనం ఇచ్చారు. ఈ ప్రదర్శనలకు శ్రీ ఆర్. ఎల్. రెడ్డి అధ్యక్షత వహించారు. చలనచిత్ర పరిశ్రమకుచెందిన శ్రీయుతులు ఎన్. టి. రామారావు, ముక్కామల కృష్ణమూర్తి, రాజనాల, ఘంటసాల వెంకటేశ్వరరావు, శ్రీమతి సావిత్రి మొదలైనవారు, ఇంకా పురప్రముఖులు హాజరైనారు. ఈ సందర్భంలో శ్రీయుతులు నరసింహారెడ్డి, ఎన్. టి. రామారావు, ఘంటసాల ప్రభృతులు ప్రసంగించారు. శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు 'జనగణమన'తో ప్రదర్శన కార్యక్రమం ముగిసింది.

ఓ. వి. ●



'ప్రైవేటుమాస్టారు'లో సుకన్య



'గొల్లభామ'లో శైలశ్రీ, విజయనిర్మల, విజయశ్రీ



'చదరంగం'లో హరనాథ్, జమున, అంజలీదేవి

వి. హేమలత కైలాసం

# వేసవి - వాచవి

వేసవి వస్తూంటే మా అమ్మమ్మ 'వేసవిలో తరవాణీ' లేని ఇల్లు తరుణిలేని ఇల్లులాటిదే తల్లీ! అన్నమాటలు జ్ఞాపకం వస్తాయి. ఆనాడు తరవాణీ కుండకి అంతటి ప్రాముఖ్యం వుండేది. కాలం మారింది. కాలంతోపాటు మనుషులు వాటి రుచులూ కూడా మారాయి. వేసవి మధ్యాహ్నం అనుకోకుండా అతిథులువస్తే ఇల్లాలు ఇరకాటంలోనే పడుతుంది మరి!

ఎండలోవచ్చే ఫ్రెండ్స్‌కి వేడివేడి టీ కాఫీలు ఇస్తే మనల్ని మనసులోనే దీవిస్తారు. ఐస్‌పార్లర్‌నుంచి డ్రింక్స్ తెప్పించాలంటే శ్రమా, వ్యయం తప్పవు. కూల్‌డ్రింక్స్ ఇంట్లో తయారుచేసి ఇయ్యాలంటే 'ఫ్రెజిడేర్' లేని గృహిణికి ఇబ్బంది లేకుండా తేలిగ్గా, చవుగ్గా అయిపోయే కొన్ని చిట్కాలు చెప్పనా!

## హోమ్‌మేడ్ ఫ్రెజిడేర్

కావలసిన వస్తువులు:

దాకల్లాటి కుండలు రెండు
ఒక పాతచీర
ఇసిక

గదిలో ఓమూలగా ఇసికపోసి దాక పెట్టాలి. అందులో మనంపెట్టే గిన్ని మునగకుండా నీరు పొయ్యాలి. ఇప్పుడు రెండోదాకని శుభ్రంగా కడిగి తడితో మొదటిదాకపై మూతలా బోర్లించాలి. చీర తడిపి రెండింటినీ కప్పాలి. చీర తడి ఆరకుండా అప్పుడప్పుడు తడుపుతూ వుండాలి. ఇంక ముందు షర్బత్తులు చేద్దాం!

పళ్ళరసాలు తీసి చేద్దామంటే అన్నిటి ధరలూ మండిపోతున్నాయి, కనుక సూక్ష్మంలో మోక్షం అవి ఎసెన్సులతో షర్బత్తులు చేయవచ్చు. ఇవి రుచిలో అసలు వాటికి ఏమి తీసిపోవు.

కావలసిన సరుకులు.

సిట్రిక్ యాసిడ్.
పంచదార
పైనాపిల్, స్ట్రాబెర్రీ, రోజ్, లెమన్ మొదలైన మన కిష్టమైన వాసనలతో ఎసెన్సులు.

## నాలుగైదు రకాల రంగులు

పంచదార తీగ పాకంపట్టి సరిపడా పులుపుకి సిట్రిక్ యాసిడ్ (అంటే నిమ్మ ఉప్పు) వేసి కలిపి, ఎవరి అభిమతాన్నిబట్టి వారు 'ఎసెన్సు' చుక్కలువేసి కలపాలి. చెమ్చాలోకి పాకంతీసి పాకానికి సరిపడా రంగువేసి కలిపి పాకంలోవేసి బాగా కలిసేటట్టు కలపాలి.

ఇప్పుడు ఈ పాకాన్ని శుభ్రమైన సీసాలో పోసి మూతపెట్టి వుంచుకోవాలి. షర్బత్తు చేసుకొందామనుకొన్న రోజున దాకనిండా నీరుపోసి వుంచుకొని గ్లాసెడు నీళ్ళకి చెమ్చా పాకంవేసి కలుపుకొని త్రాగితే హాయిగా వుంటుంది.

సబ్జాగింజలు నానపెట్టి, అవీ అయిస్ ముక్కలూ వేసి వచ్చినవారికి ఇస్తే వారికి ప్రతీ వేసవిలోనూ మనం తప్పక గుర్తుకొస్తాం!

## బాదంఖీర్

కావలసినవి:—

శేరు పాలు
పదిహేడు సీమ బాదంకాయలు
పచ్చకర్పూరం, కుంకంపువ్వు
ఏలకులు చారపప్పు
పంచదార

పొద్దున్న బాదంఖీర్ చేస్తామనగా రాత్రే సీమ బాదంకాయలు కొట్టి పప్పు నీళ్ళలో నానవెయ్యాలి. పొద్దున్న తొక్కవల్చి మెత్తగా రుబ్బి గిన్నిలోకి తీసుకోవాలి. రోలుకడిగి ఆ నీరుకూడా తియ్యాలి. చేసేది తీపి పిండివంట కనుక రోలు శుభ్రంగా కడగాలి.

శేరు పాలల్లోనుంచి అరసోలడు పచ్చిపాలు తీసివుంచుకొని మిగతావి బాగా ఎర్రగా తొరక కట్టనివ్వకుండా మరనియ్యాలి. పాలుకాగుతోంటే రుబ్బిన బాదం ముద్ద వేసి కలిపి రెండుమూడు పొంగలు రానిచ్చి గిన్ని దించాలి. పచ్చిపాలు పోసి, ఏలకుపొడి, కుంకంపువ్వు పచ్చకర్పూరంకు నలిపివెయ్యాలి. చెమ్చాపాలల్లో కాస్త రంగు వేసి కలిపి బాదంఖీర్‌లో వేసి కలపాలి. ఇందులో ఇష్టమున్నవారు ఆల్మండు ఎసెన్సు వేసుకొంటారు. చారపప్పు గులాబీరేకులువేసి పైన తేలుతూ కంటికి ఇంపుగా వుంటాయి.

ఒక సంగతి. బాదంఖీర్ చల్లారాక ఆగిన్ని చన్నీళ్ళుపోసిన దాకలో పెట్టాలి. పైన చీరకప్పి తడపాలి. మనం తాగేవేళకి చల్లగా వుంటుంది. గిన్నిలోకి నీళ్ళు వెళ్ళకుండా జాగ్రత్తపడండి.

సరదా వున్నవారు మూడు నాలుగు పౌనుల అయిసుతెచ్చి కొట్టి వుప్పుకలిపి దాకలో అడుగున కాసినివేసి గిన్నిపెట్టి గిన్ని చుట్టూరా అయిస్ ముక్కలు వెయ్యాలి. గిన్నిపై కైవారం కన్నా పెద్ద దిగావున్న మూత చూసి గిన్నిపై బోర్లించి మూత పైన కూడా అయిస్‌ముక్కలు వెయ్యాలి. అయిస్ కరిగిన నీరు లోపలికి వెళ్ళనియ్యకూడదు.

శ్రమ అనుకోకపోతే ఖర్చు తక్కువలో ఇంటిల్లిపాదీ ఆనందంగా బాదంఖీర్ త్రాగవచ్చు. పిల్లలు మరికాస్త అడిగినా ఫర్వాలేదు.

ఇల్లాగే జీడిపప్పు, పచ్చి వేరుశెనగపప్పు కూడా ఉజ్జాయింపుగా నానవేసి రుబ్బి చేసుకోవచ్చు. ఇవి కూడా చాలా రుచిగా వుంటాయి.

గసగసాలతో:—

అర్ధశేరు పాలు
అర్ధపావు గసగసాలు
చారెడు బియ్యం
కాసిని సేమ్యాలు
ఏలకుపొడి, పచ్చకర్పూరం

పంచదార

బియ్యంకడిగి నానపొయ్యాలి. ఓ గంట అయ్యాక బియ్యం గసగసాలు కలిపి ముద్దలా రుబ్బి తీసుకోవాలి. సేమ్యాలు దోరగా వేయించి పాలు మరుగుతోంటే వేసి వుడక నియ్యాలి. సేమ్యా కాస్త వుడికాక గస గసాలముద్ద వేసి రెండుపొంగులు రానిచ్చి పంచదారవేసి కలిపి దింపుకోవాలి.

ఇదికూడా బాదంఖీర్‌లాగే చల్లావర్చుకొని తాగితే బాగుంటుంది.

పిల్లలకి మధ్యాహ్నం మనం ఎలాగా పాలు యిస్తాము. ఆపాలతోనే ఏదో ఒకటి కాస్త శ్రమపడి తయారుచేసి యిస్తే పిల్లలు ఎంతో ఆనందిస్తారు. వాళ్ళ ఆనం దమే మన ధ్యేయం కదా! ఇంక శ్రీవారి మెప్పు సరేసరి!

డ్రింక్స్ అయ్యాయా! బ్లొమాన్స్. ఫ్రూట్ పుడ్డింగ్, ఫ్రూట్‌సాలెడ్, జెల్లీ ఎలా చేయాలో తెలుసా!

బజార్లో బ్లొమాన్స్ ప్యాకెట్లు అమ్ము తారు. ఒక పాకెట్‌లో ఆరు చిన్న చిన్న ప్యాకెట్లు వుంటాయి. ఆరు ప్యాకెట్లూ ఆరు ఫ్లేవర్సులో ఆరు రంగుల్లో చక్కగా వుంటాయి. చిన్న ప్యాకెట్ ఒకటి ఒక పావు శేరుపాలు కావాలి. పావుకప్పు పాలుతీసి విడిగా వుంచుకోవాలి. మిగతా పాలు కాగుతోంటే, తీసి వుంచుకొన్న పాలల్లో చిన్న పాకెట్ లోని పొడి కలిపి మరుగుతోన్న పాలల్లో వేసి వుండ కట్టకుండా కలుపుతూవుండాలి. గట్టిపడుతోంటే మనకి సరిపడా పంచదార వేసి గట్టిపడ్డాక దింపుకోవాలి. డిష్‌కి నీళ్ళు రాసి ఈ బ్లొమాన్స్ అందులోకి వంచు కొని పరిచేసుకోవాలి. ఓ రెండు సీమ బాదంపప్పులు నానవేసి చాకుతో సన్నగా తరిగి పైన అందంగా అమర్చాలి. దీనిని కొంసేపు ఫ్రిజిడేర్‌లోపెట్టి వుంచు కొని సాయంత్రం తినాలి. దీనినే కొందరు 'కోల్డ్ కస్టర్డ్' అంటారు.

జొన్నుగడ్డితో : —

జొన్ను గడ్డి పావుతులం
పావు శేరు పాలు
పంచదార
పచ్చ కర్పూరం

జొన్ను గడ్డి చిన్నచిన్న ముక్కలుగా కోసి కాసిని నీళ్ళలో రాత్రే నానపెట్టాలి. ఉదయం పాలతో బొమాన్స్‌లాగే దానిని కూడా తయారుచేయాలి. ఇది తెల్లగా

వెన్నెలలా వుంటుంది. రంగుకావాలనుకొనే వారు రంగువేసుకోవచ్చు.

## ఫ్రూట్స్ పుడ్డింగ్

అరటిపళ్ళు—రెండు
బత్తాయిపండు—ఒకటి
బంగినపల్లి మామిడిపండు—ఒకటి
రకరకాల పళ్ళ తలొకటే
కస్టర్డ్ పౌడర్ ప్యాకెట్
శేరుపాలు
పంచదార
ఎండుద్రాక్ష, జీడిపప్పు

పళ్ళని తొక్కలుతీసి చిన్నచిన్న ముక్క లుగాచేసి వుంచుకోవాలి. వాటిపైన పంచ దార చల్లాలి. కస్టర్డ్ పౌడర్ కాసిని పాలల్లో కలిపివుంచాలి. ఎండుద్రాక్ష, జీడి పప్పు నేతిలోవేయించి వుంచుకోవాలి.

పాలల్లో సరిపడేంత పంచదారవేసి పళ్ళ ముక్కలు, పౌడర్ కలిపిన పాలుపోసి కలిపి సన్నని సెగమీదపెట్టి వుండలు కట్ట కుండా కలుపుతూవుండాలి. ఏమాత్రం అశ్రద్ధచేసినా వుండలుకట్టి పుడ్డింగ్ పాడైపోతుంది. బాగా చిక్కపడ్డాక జీడి పప్పు, ద్రాక్షపళ్ళువేసి దింపి చల్లారాక మన ఫ్రిజిడేర్‌లో పెట్టుకోవాలి. సర్వ్‌చేసే టప్పుడు పైన కొద్దిగా అయిస్ ముక్కలు వేస్తే హిమవంతంలా నోట్లో వేసుకోగానే కరిగిపోతుంది.

## ఫ్రూట్ శాలడ్

ఫ్రూట్‌శాలడ్ రకరకాల పళ్ళతో చేయ వచ్చు. అనాస, కోతమామిడిపళ్ళు, అరటి ద్రాక్ష, పీచ్‌పండ్లు మొదలైన రకరకాల పండ్లతో చేసినప్పుడే. దానిరుచి. శాలడ్ డ్రస్సింగ్‌కి టమేటారసం, కమలా, బత్తాయి, మామిడి అనాస పండు రసాలు వాడవచ్చు. ఎటొచ్చీ రసం మటుక్కు తేటగా గింజలు, ముత్యాలూ, పీచులూవుండకూడదు. కొందరు లేత పంచదార పాకం వాడతారు.

పళ్ళు మరీ మిగల ముగ్గినవికాకుండా పక్వానికివచ్చినవై వుండాలి. పళ్ళని తొక్క తీసి చిన్నచిన్న ముక్కలుగా చాకుతో కొయ్యాలి. కప్పులో రసంపోసి ముక్కలు వేసి పంచదారవేసి బాగా కుదపాలి. దీన్ని మన ఫ్రిజిటేర్‌లో పెట్టి వుంచుకోవాలి.

శాలడ్‌కి పైన అయిస్‌క్రీమ్, జెల్లీ కూడా సర్వ్‌చేస్తూవుంటారు.

అయిస్‌క్రీమ్ బక్కెట్ కొనుక్కొంటే అయిస్ క్రీమ్‌కూడా ఇంట్లో చేసుకోవచ్చు. దీని ఖరీదుకూడా చాలా తక్కువ.

ఐస్‌పార్లర్‌లో శాలడ్‌పైన తమాషాగా పీచ్‌పండు పెడతారు. పీచ్‌పండు దొరకక



రష్యన్ ఫెడరేషన్‌వారి కళాప్రదర్శనంలో ప్రదర్శింపబడిన ఈ లేస్, ఎంబ్రాయిడరీని ఎం. తెంచ్ తివా రూపొందించారు.

పోతే అనాబ్ షాహీ ద్రాక్షపండు పెడితే అందంగా వుంటుంది.

అనాస టిన్నుల్లో ముక్కలైతే మృదు



# వేసవి-వాచవి

వుగావుంటాయి. ఎక్కువ తీసి కనుక వేశారంటే పండ్ల ముక్కల సహజ రుచి పోతుంది.

## ఫ్రూట్ జెల్లీ

చాలా కంపెనీలు జెల్లీ పొడర్లు బజార్లో అమ్ముతారు ఒక జెల్లీ ప్యాకెట్‌కి ఐదారు కప్పుల జెల్లీ అవుతుంది. జెల్లీ క్రిస్టల్సు స్ట్రాబెర్రీ, లెమన్, రాస్‌బెరీ, పైనాపిల్, వనిలా ఇలా చాలా సువాసనలతో రుచులలో వుంటాయి. మన కిష్టమైన ప్యాకెట్ ఒకటితెచ్చి ఒక పయింట్ అంటే సుమారు ఒక పావుశేరు నీళ్ళు వెచ్చపెట్టాలి.

జెల్లీ ప్యాకెట్ విప్పి గిన్నెలోకి పొడి వంచుకొని రెండు మూడు చెమ్చాల పంచదార కలపాలి. వెచ్చపెట్టిన నీరు ధారగా పోస్తూ పొడిని కలపాలి. ఈవేడికి జెల్లీ క్రిస్టల్స్ కరుగుతాయి.

ఆరు పౌనుల అయిస్‌తెచ్చి మన ఫ్రెజిడేర్‌లో జెల్లీ నీళ్ళు గిన్నెలోపోసి మూత పెట్టి కిందా చుట్టూరా పైన అయిస్ వెయ్యాలి. సుమారు గంటన్నరకి జెల్లీ గట్టిపడుతుంది. తినేటప్పుడు తీసుకొని ఫోర్కుతో కొడితే చిన్న చిన్న ముక్కలలా అవుతుంది. పుల్లగా కావాలనుకొంటే పంచదార వెయ్యక్కరలేదు.

రిఫ్రిజిరేటర్‌వుంటే ఈ నీళ్ళు అయిస్ ట్రేలోపోసి రెగ్యులేటర్‌ను మాగ్జిమమ్‌లో వుంచితే గంటకి జెల్లీ తయారవుతుంది.

## లస్సీ

ఒక గ్లాసు మజ్జిగ లేక పాలు.

రెండు పైపల అయిస్‌ఫ్రూట్‌లు రెండు. అర చెమ్చా పంచదార.

అయిస్ పాల్కు లేకపోతే అప్పటికప్పుడే చేసుకోవాలి. గ్లాసు చిక్కటి మజ్జిగ లేక పాలల్లో అరచెమ్చా పంచదారవేసి కరగనియ్యాలి. అయిస్‌ఫ్రూట్‌లు ముక్కలుచేసి పాలల్లోవేసి ఎగ్‌బీటర్‌తో నురగవచ్చేదాక గిలకొట్టాలి. తర్వాత ఏంచెయ్యాలో నే చెప్పాలా!

తీపి తిని తిని మొహం మొత్తిందనే వారికి ఈ బటర్‌మిల్క్ శాలడ్ బావుంటుంది.

కావలసినవి:—

అరటిపండ్లు

కోతమామిడిపండ్లు

యాపిల్, నారింజ

బత్తాయి, ద్రాక్ష

కాసిని మిరియాలు, పచ్చిమిర్చి, ఉప్పు

చిక్కటి మజ్జిగ

పండ్లన్నీ చెక్కుతీసి చిన్నచిన్నముక్కలు చెయ్యాలి. మజ్జిగలో ఉప్పు పచ్చిమిర్చి, మిరియంపొడి పోసి కలిపి పండ్లముక్కలువేసి మన ఫ్రెజిడేర్‌లో పెట్టాలి.

పండ్లతోటేకాదు ఇల్లాగ పచ్చికూరలతో కూడా చేసుకోవచ్చు.

టమేటాలు

క్యారట్‌లు

చిలకడదుంపలకోరు

కొబ్బరి కోరు

లేతబీరకాయలు, నిమ్మకాయ, కొత్తిమెర లేక పుదీనా

క్యారెట్‌లు, టమేటాలు పల్చగా ముక్కలు తరగాలి. మజ్జిగలో కొబ్బరి, చిలకడ దుంపల కోరు, తరిగినముక్కలు, పచ్చిమిర్చి ముక్కలు ఉప్పు, నిమ్మరసం వేసి కలపాలి. మన ఫ్రెజిడేర్‌లో రెండుమూడు గంటలు వుంచి తీసిచూస్తే కొత్తిమీర ఘుమఘుమలతో నోరూరుతుంది.

ఈకాలం పిల్లలకి బార్లీ, సగ్గుజావలలో పాలో మజ్జిగో కలిపి ఇస్తే మంచిది. మరీ పసిపిల్లలకి ఎండుద్రాక్షపళ్ళు ఓ అరు కాగి చల్లార్చిన నీళ్ళల్లో నానవేసి వాడితే వడగాల్పు గొట్టదు. ఓవేళ ఎవరికేనా వడగాల్పు కొడితే వెంటనే చల్లటినీళ్ళతో వళ్ళంతా తుడిచి మెల్లగా విసరాలి. తాగేందుకు మజ్జిగతేట ఇస్తే సర్దుకుంటారు.

మజ్జిగలో దబ్బాకులో, చిటికెడు శొంఠిపొడో వేస్తే సువాసనతో తేట ఎండవేళప్పుడు ఉప్పువేసుకు త్రాగేందుకు సరదాగా వుంటుంది.

నిమ్మకాయనీళ్ళు, తేనె నీళ్లు త్రాగడం సంగతి మీకు తెలిసిందే కదా! తెలివిగా చేసేవారికి తెలుసుకోలేని విషయముండదు. ఇల్లాలికి ఏదోవక కొత్తరకంచేసి పిల్లలికి శ్రీవారికిపెట్టాలనే ఆసక్తివుండాలి కాని చెయ్యలేని పనే వుండదు. మన వంటిల్లే మనకి లేబరేటరీ. ఇలా అన్నానని నవ్వుతున్నారా! నవ్వకండి! నవ్వకండి! మీనవ్వులలోనే మన పిల్లల భవిష్యత్తు వెలుగు వెలుగులు దిద్దుకొంటుంది. ●

# ఫ్లారెన్స్ నైటింగేల్

(25 వ పేజీ తరువాయి)

(దేశ పర్యటన సందర్భంగా తల్లిదండ్రులకు ఉత్తరంలో)

[కైసర్స్‌వర్త్ సంస్థ దేశ ప్రఖ్యాతి గాంచిన సంస్థ. ఆ హాస్పిటల్లో వంద బెడ్స్ వుండేవి. అక్కడి సేవికలు జీతాలు తీసుకొనేవారు కాదు. రోయింబవళ్లు సేవ చేయడమే వారికి ప్రతిఫలం! ఫ్లారెన్స్ అక్కడి విశేషాన్ని చూసి జీవితమంటే ఏమిటో తెలుసుకుంది. జీవితాన్ని ప్రేమించడం ఎలానో నేర్చుకుంది. సేవ చేయడానికి దేవుడే ఈ మార్గాన్ని చూపించాడనుకుని పరవశించిపోయింది.]

'ఆనందమనేదాన్ని నేను ఎప్పుడూ రుచి చూసి వుండలేదు. కైసర్స్‌వర్త్ నాకా అదృష్టాన్ని ప్రసాదించింది.'

—తన డయిరీలో, ఫ్లారెన్స్.

[కైసర్స్‌వర్త్‌లో కొంతకాలం శిక్షణ పొంది ఆ శిక్షణను సద్వినియోగం చేయడానికి పథకాలు వేసుకొనసాగింది. సుఖాన్ని ఆమె దరిదాపులకి రానిచ్చేదికాదు. లండన్‌లోని హాస్పిటల్స్‌లో మరికొంతకాలం శిక్షణ పొందాలనుకున్నది. అక్కడినర్సులు ఎప్పుడూ తాగి తందనాలాడుతూ వుండేవారు. అందుకు ఫ్లారెన్స్ అక్కడికివెళ్లి శిక్షణ పొందడం తలిదండ్రులకి ఇష్టంకాలేదు. ఫ్లారెన్స్ ఇంటిదగ్గరే వుంటూ వైద్య సంబంధమైన గ్రంధాల్ని చదువుతూ అమితమైన విజ్ఞానాన్ని సంపాయించుకున్నది. పారిస్, బెర్లిన్ నగరాల్లోవున్న గొప్ప గొప్ప హాస్పిటల్ అధికార్లతో సంప్రతింపులు జరిపింది. ఎట్టకేలకు 1853 లో సిడ్నీ హెర్బర్ట్ అనే ఒక రాజకీయవేత్త ఫ్లారెన్స్ తల్లిదండ్రుల్ని ఒప్పించి ఆమెను లండన్‌లోని ఒక హాస్పిటల్‌కు పంపించాడు. టర్కీతో లాలోపీలయి ఇంగ్లండు, ఫ్రాన్సు రాజ్యాలు రష్యామీద యుద్ధం ప్రకటించిన రోజులవి. లండన్ వెళ్లిన కొత్తలో ఫ్లారెన్సుకు రోగులకు డ్రస్సింగ్ చేయడం పనిమాత్రమే వుండేది. యుద్ధం రావడంతో ఆమెకు ఎక్కువ అవకాశం లభించింది. గుర్తింపూ లభించింది. అప్పటికి ఒక్క పురుషులు మాత్రమే నర్సింగ్‌పని చేస్తూ వుండేవారు. ఇప్పుడు ఫ్లారెన్సు ఆధ్వర్యంలో స్త్రీలకు శిక్షణనివ్వడానికి యుద్ధమంత్రి సిడ్నీ హెర్బర్ట్ అనుమతించాడు. ఫ్లారెన్స్ హృదయం పొంగిపోయింది. బ్రిటిషు ఆర్మీ చరిత్రలో ఇది గొప్ప సంఘటన. ఫ్లారెన్సు తన కర్తవ్య నిర్వహణకు పూనుకున్నప్పుడు ప్రపంచం కళ్లన్నీ ఆమెమీదనే కేంద్రీకరించాయి.]

'39 మంది నర్సులం ఇక్కడికి చేరుకున్నాం. అయిదుగదులు మాకు కేటాయించారు. అందులో ఒకటి వంటగది. గృహోపకరణాలు ఏమీలేవు. పడుకోడానికి అంత కంపె లేవు. వంట వండుకోడానికి కూడా ఏమీలేవు. దీపాలుకాదుగదా. మైనపు వత్తులుకూడాలేవు. ఎక్కడచూసినా ఈగలు, ఎలుకలు. పరిస్థితి ఇలా వుండగా, రోగులు వేలకువేలు వచ్చిపడుతూ వుండేవారు. సుమారు 12 వేలమంది రోగులున్నారు. వాళ్లందరికీ మేము 39 మంది మీ సేవ చేయాలి ఇది మాకు పరీక్ష!'

—కుమారి నైటింగేల్

(తల్లికి ఉత్తరంలో)

[1855 ప్రాంతంలో బ్రిటిష్ సైన్యంలో బాధితులు విపరీతంగా పెరిగిపోయారు. చాలా భయంకరమైన పరిస్థితి అది. అటువంటి అత్యవసర పరిస్థితుల్లో ఫ్లారెన్స్ నైటింగేల్ ప్రముఖురాలయింది. సైన్యమంతా ఆమె సేవకు నీరాజనాలర్పించేవారు. ఆమెను దేవతగా పూజించేవారు.]

'మిస్ నైటింగేల్ గనుక మా సైన్యాన్ని నడిపించినట్టయితే మేము ఒక వారంలో సెబస్టపోల్‌ను వశపరచుకుంటాం.'

—క్రిమియాలోని సైనికులు.

'రోగులు మహాప్రవాహంలా వచ్చి పడిపోతూవుంటే ఇరవైనాలుగ్గంటలూ కాళ్లమీద నిలబడి నైటింగేల్ సేవచేస్తూ వుండేది. మోకాళ్లమీద నిలబడి ఎనిమిది గంటలు సుమారుగా కట్లు కట్టడం నేను చూశాను. కట్లుకడుతూ, రోగుల్ని ఓదార్చుతూ కష్టమంటే ఏమిటో ఎరగనట్టు సేవ చేసేది. అంటురోగాల్ని ఆమె లెక్క చేయలేదు. కలరాతో చచ్చిపోయేవాళ్లచెంత గంటలకు గంటలు కూర్చుని సేవచేసేది. రాత్రి ఎనిమిదిగంటల తర్వాత నర్సుల నెవర్నీ హాస్పిటల్లో వుండనిచ్చేదికాదు. మిగతారాత్రి ఆమె శ్రమించేది.'

—(క్రిమియాలోని ఒక సర్జను ఇంటికిరాసిన ఉత్తరంలో)



మసూచి నివారణకు టీకాలువేయడంలో అమెరికా కొత్తపద్ధతి కనిపెట్టింది. ఇది జెట్ తుపాకితో ఇన్‌జెక్షన్ చేయడం. అమెరికా ప్రజారోగ్య నిపుణుడు డాక్టర్ గార్డన్‌రాడ్ న్యూఢిల్లీలో లాలాలజపత్‌నగర్ ప్రాంతంలో ఒక మహిళకు జెట్‌గన్‌తో మశూచి టీకాలమందును ఇంజక్షన్‌చేయడం ఈ ఫోటోలో చూడవచ్చు.

# బాధే ఆనందం

రవి ఉదయిస్తాడు, అస్తమిస్తాడు ప్రతిరోజూ. ఆశలు రేకెత్తుతాయి. అణగారిపోతుంటాయి ప్రతి వ్యక్తికి. వెలుగుచీకట్లవలె ఆశ నిరాశలు విడువకుండా వెంటాడుతుంటాయి. అంతే నా జీవితం అని అనిపిస్తూంటుంది. కాదు. ఉదయాస్తమయాలమధ్య వెలుగు ఆశ నిరాశలతోకూడా జీవితం వుంటూనే వుంటాయి. హిమోన్నత శిఖరాలలో జనించిన నదులు సాగరంలో కలవక తప్పకపోయినా, దారిలో ఎన్నో ఎడారులను సస్యశ్యామలం చేస్తూంటాయి. ఎందరికో దప్పిక తీరుస్తూంటాయి. సుందరమైన చెట్లను పెంచుతుంటాయి. అట్లాగే ప్రతి వ్యక్తి జీవితంకూడా ఎంతో కొంత మంచిచేస్తే ఎంత ఆనందముగా మారుతుంది?

ఈలాంటి ఆలోచనలు మీ అందరికీ లాగే నాకూ వస్తూండేవి. ఆరుబయట వెన్నెలలో కూర్చున్నా, మా వూరిప్రక్క కొండ ఎక్కి చూస్తున్నా, నదిఒడ్డు ఒంటరిగా నడుస్తున్నా, దిగజారుతున్న ఆర్థిక పరిస్థితి, క్రుంగదీస్తున్న కుటుంబపు చీకాకులు, అవసరమొస్తే ఆదుకోలేని మిత్రులు, ఈ పరిస్థితులలో ఏదైనా ఎలా చేయటం? మనకు సాధ్యమా? అని శంశయాలు భూతాలవలె వెంటాడుతున్నా, గంపెడాశతో గుంటూరు బయలుదేరా. ఎప్పుడో చదువుకున్న పరిచయాలు. ఎట్లా ఈ నగరంలో ఏమీ లేకుండా జీవించటం అని భయమేసేది. ఏ పనిలో నాకు సామర్థ్యమున్నదని రుజువు చేసుకోవటం, కాళ్ళు వాచేలా తిరగ్గా ఒక చోట గది అద్దెకు దొరికింది. చేతిలోని పది రూపాయలు అడ్వాన్సుగా యిచ్చాను. ఇక తరువాత తిండి? రెండు మూడు రోజులు గడిచాయి. మిత్రులు కనిపిస్తున్నారేగాని, అన్నం తిన్నావా? మాయింటికి కొస్తావా? అన్నవాళ్ళేలేదు. అప్పడిగితే తీర్చటం ఎట్లా? ఇలా మూడు రోజులు ఉపవాసాలతో గడిచినయి. తిరిగి యింటికి వెలదాం అని అనిపించేది. గాని, తిరిగిపోతే వూళ్ళో వాళ్ళు ఏమంటారు. ఇలా అనుకుంటూ గుండె చిక్కబట్టుకుంటూ, దగ్గరలో క్రొత్తగా పెట్టిన కాఫీ హోటలు యజమానిని ఒక్క రూపాయివరకు అప్పు పెట్టమని అడిగితే ఎగాదిగా చూసి సరే నన్నాడు. అమ్మ, ఎనిమిది రోజులవరకు గ్యారంటీగ అరకప్పు కాఫీ దొరుకుతుందని నమ్మకం దొరికింది. ఆనందముగా ఒక అరకప్పు తెప్పించుకొని త్రాగుతుండగా ఎదురుగా కూర్చున్నాయన ఎగాదిగా చూస్తున్నాడు 'మీరేం చేస్తున్నారు' అని అడిగాడు. "ఏమి లేద"న్నాను. ఏం చదువుకున్నారంటే 'ఎం. ఏ.' అన్నాను. 'పాపం' అన్నాడుకాని నా బిల్లు నేను యిచ్చుకున్నానులెండి. ప్రైవేట్లు చెప్పకూడదూ అన్నాడు. నా కది యిష్టమేగాని పిల్లలేరీ? అన్నా. "ముందు మా వాడితో ప్రారంభించండి. వాడుట్టి బడుద్దాయి" అన్నాడు. చేతనైనంతవరకు చేస్తాను అని ప్రారంభించాను. 1957 లో. ఆ సంవత్సరంలో 10 మంది. ఆనాటి నుండి శక్తివంచనలేకుండా, మన అలసత్వంవల్ల విద్యార్థులకు ఏం లోపం వస్తుందోననే భయంతో నేటికి అలాగే శాయశక్తుల కృషి చేస్తున్నాను. విద్యార్థులు చెల్లించేదాంట్లో వారి సౌకర్యాలు ముఖ్యముగా చూస్తూ వారికే లోపం రాకుండాచూస్తునే యున్నాను. అందువలననే రెండు పెద్ద లెబొరేటరీలు, పెద్దలైబ్రరీ, ఫిలిం ప్రొజెక్టరు, మొదలైన సామగ్రి సుమారు ఒక లక్ష రూపాయల విలువగలవి ఏర్పాటు చేశా. మంచి జీతాలిచ్చి మంచి అధ్యాపకులను నియమిస్తూ, వసతికి హాస్టల్సు, క్రమశిక్షణకు భంగంలేకుండా బాల బాలికలకు ఇంగ్లీషు తెలుగు మీడియంలకు వేర్వేరు కళాశాలలు ఏర్పాటు చేశా. అందుకే యీనాడు మూడు కాలేజీలలోను 1500 మంది సకల సౌకర్యాలతోను, చదువుకోగల్గుతున్నారు. మీరందరూ చూపుతున్న ఆదరణకు ఎలా ఋణం తీర్చుకోవాలో ఎప్పుడూ ఆలోచిస్తున్నాను. ఎంత బాధపడి దీన్ని నిర్మించానో అంత ఆనందం ఈరోజు కలుగుతుంది. మీ సహకారం సదా కోరుతున్నాను.

**పి. వి. ధన్, ఎం. ఏ., ప్రిన్సిపాల్,**
రవి ట్యుటోరియల్ కాలేజీ,
బ్రాడీపేట—గుంటూరు—2.

# ఫ్లారెన్సునైటింగేల్

[ఫ్లారెన్సు నైటింగేల్ అగణిత సేవను ప్రత్యక్షంగా చూసినవారందరూ ఆశ్చర్యపోయారు. ఆమె సేవా విశేషాలు 'టైమ్సు'లో ప్రచురించారు. అవి ప్రపంచవ్యాప్తంగా యశస్సు నార్జించిపెట్టాయి. ప్రజలామెను 'ది లేడీ విత్ ది ల్యాంప్' అని కీర్తించారు. అప్పటిలో 'క్రిమియన్ ఫీవర్' చాలా ఉధృతంగా వుండేది. అదొక భయంకరమైన అంటు జాడ్యం. ఈ జాడ్యం సోకిన రోగులకు సేవచేసిచేసి నైటింగేల్ రోగపీడితురాలయింది.]

'మిస్ నైటింగేల్‌ను స్ట్రెచర్‌మీద కేజిల్ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాము. నేనామెను పరీక్షించాను. ఆమెకు మృత్యువు చాలా సమీపంలోవున్నట్లు గ్రహించాను. సైనికులు గోడచాటుచేసుకుని కంట తడి పెట్టుకున్నారు. కొందరు గట్టిగా ఏడ్చారు. మళ్ళీ వెంటనే రోగం తగ్గుముఖం పట్టింది. సైనికులంతా తాము భగవంతుడికి మొక్కుకున్న కారణంగా నైటింగేల్ తిరిగి జీవించిందనుకున్నారు. పూర్తిగా కోలుకునేవరకు రోగులదగ్గరకు వెళ్ళకుండా ఆమెను ఆపడానికి అక్కడిడాక్టర్లు ఎంతో శ్రమపడవలసివచ్చింది.'

—శ్రీమతి రోబర్ట్సు
(తోటివాళ్ళకు ఉత్తరంలో తెలియపరుస్తూ)

1856 ఏప్రిల్ 29 నాటికి యుద్ధం తగ్గిపోయింది. ప్రజలందరూ ఫ్లారెన్సు నైటింగేల్‌ను సత్కరించాలనుకున్నారు. ఎంతో ఘనమైన సత్కారసభ ఏర్పాటు చేశారు. ఎన్నో గౌరవపత్రాల్ని ఇచ్చి గౌరవించారు. ఆ తర్వాత నైటింగేల్ తన నిజ గృహానికి తిరిగివచ్చింది. అక్కడ కూడా అమితమైన సేవచేసింది. రోగపీడితులను, పేదవారిని శక్తివంచనలేకుండా కాపాడింది. స్త్రీపురుషులకు మతవర్గభేదాలులేకుండా చేసిన ఆమెసేవ ఎంతో పవిత్రమైనది. ఆదర్శమైనది. ఆమె దేవత!

—వి. ఎస్.

**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**